# ఆంధ్రపత్రిక

317587



**The Andhra Patrika, Madras.** } Regd. No. M. 1118 Vol. 36 No. 228 MONDAY 21st NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

## "తుపాన్ బాధితులైన ఆంధ్రులకు విరివిగా సహాయపడండి"

### బీహారు ప్రజలకు గవర్నర్ ఆనే ప్రధాని శ్రీకృష్ణసిన్హాగారల విజ్ఞప్తి

పాట్నా, నవంబరు 19: తుపాను వల్లను, వరదలవల్లను నష్టపడిన ఆంధ్రుల సహాయనిధికి ఉదారముగా విరాళములు ఒసంగవలసినదని కోరుచు బీహారు గవర్నరు శ్రీ ఎమ్. ఎస్. ఆనేగారును, బీహారు ప్రధాని శ్రీ కృష్ణసిన్హాగారును బీహారు ప్రజలకు విజ్ఞప్తి గావించియున్నారు. వారి ప్రకటన యిట్లున్నది. "ఆంధ్రదేశమునందలి సముద్రతీర ప్రాంతములలో తుపానువల్లను, వరదలవల్లను అపరిమితమైన నష్టము కలిగినదని బీహారు ప్రజలకు తెలిసియే యున్నది. ఈ బీభత్సమువల్ల ధనప్రాణములకు విశేష నష్టము వాటిల్లినది. మిగులు ప్రాంతములకు జిల్లాలలో కరువేర్పడినది. కనక బీహారు ప్రజలు, ముఖ్యముగా సంపన్నులు మద్రాసు ప్రభుత్వమువారు ప్రారంభించిన నిధికి ఉదారముగా ద్రవ్యసహాయము చేయవలెనని కోరుచున్నాము."

## భారత ఆర్థికవ్యవస్థతో

## చక్కెర ఉత్పత్తిలో సాలుకు 10 లక్షల టన్నుల అభివృద్ధి

### సర్దార్ పటేల్ ఆదేశం : పారిశ్రామికుల సమ్మతి

న్యూఢిల్లీ, నవంబరు 19: వర్తమాన చక్కెర ఋతువులో చక్కెర ఉత్పత్తిని 100 కి 10 వంతులు హెచ్చించవలెనని ఉపప్రధాని సర్దార్ పటేలుగారు చక్కెర ఉత్పత్తిదార్లను కోరెనని నేడు తెలిసినది.

చక్కెర ఉత్పత్తిదార్లలో ప్రముఖులగు ఆర్గురిని, శ్రీ రాయ్, బి. ఎన్. బిర్లా, కరిమ్‌చంద్ థప్పర్, సారాంగ్ మరి యిద్దరిని సర్దార్ పటేల్‌గారు నిన్న ఢిల్లీలో సమావేశపరిచి ప్రస్తుత చక్కెర లోటును తొలగించుటకు వెంటనే చక్కెర ఉత్పత్తిని 10 లక్షల టన్నులు హెచ్చించవలసిన ఆవశ్యకతను స్పష్టపరచెను. చక్కెర ఉత్పత్తిదారులు సర్దార్ కోర్కెను మన్నించిరని, ఉత్పత్తిని హెచ్చించుటకు అవసరమైన చర్యలు గైకొన అంగీకరించిరని తెలియుచున్నది. ప్రభుత్వమువారు తమకు కొన్ని సౌకర్యాలు కలిగించవలెనని, అనగా చెరుకుగడ రవాణాకు ఎక్కువ వాగన్లు సరఫరాచేయుట, రవాణాఛార్జీలను తగ్గించుట మున్నగు సౌకర్యములు కలిగించవలెనని ఉత్పత్తిదార్లు కోరిరని చెప్పుచున్నారు. ఉత్పత్తిదార్లు తమ అవసరములను తెలియబరచే యెడల ప్రభుత్వమువారు వానిని సాధ్యమైనంతవరకు అంగీకరించెదరని సర్దార్ పటేలు హామీయిచ్చెనని తెలియుచున్నది.

### అబ్దుల్లాపురం చక్కెర ఫాక్టరీ నిర్ణయం

సిమ్లా, నవంబరు 19: డిసెంబరు నెలారంభమున అబ్దుల్లాపూరు నందలి చక్కెర ఫ్యాక్టరీ దినమునకు 600 బస్తాల చక్కెర ఉత్పత్తిచేయునని, జనవరి మాసాంతమున ఈ ఉత్పత్తి రోజుకు 1,030 బస్తాలకు హెచ్చునని యిచ్చటికి వార్తవచ్చినది.

### పోర్చుగలులో భారత రాయబార మంత్రి

లిస్బన్, నవంబరు 19: పోర్చుగలులో భారత రాయబారిగా నియమింపబడిన మి. అచ్యుతమీనన్ పోర్చుగలు అధ్యక్షుడైన ఆంటోనియో ఆస్కార్ కార్మోనాకు తన అధికారపత్రాలు సమర్పించారు.

### మైకా, మాంగనీస్ ధరల హెచ్చింపు

#### త్వరలో ప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, నవంబర్ 19 : మైకా, మాంగనీసుల ధరలను పూర్వపు డాలర్ విలువలకు పెంచటానికి ప్రభుత్వం నిర్ణయించినట్టు రూఢిగా తెలుస్తున్నది.

ఇటీవల కొంతమంది వ్యాపారస్థులు ప్రభుత్వాన్ని కలుసుకుని, వాటి ధరలను పూర్వపు డాలర్ విలువకు పెంచితే యిబ్బంది యేమీ రాదని తెలియజేశారు. పెట్రోలు మాస్తరుగానే వీటికెంటికీ కూడా అంతర్జాతీయంగా, ఒక నిర్ణీతమైన డాలర్ విలువ వున్నదనీ, అంతకు తక్కువకు అమ్ముకోవలసిన గత్యంతరం లేదనీ వారు తెలియజేశారు. ఎగుమతి దిగుమతులు చేసుకునే దేశాలను బట్టి ధరలలో తేడాలు రావలసిన పనేమీ లేదని వారు నిరూపించారు.

వీరి అభిప్రాయాలను ప్రభుత్వం ఆమోదించినట్టు తెలుస్తున్నది.

ఈ సంవత్సరంలో మొత్తం, 500,000 టన్నుల మాంగనీసును భారతదేశం డాలర్ మొదలైన కఠిన చలామణి ప్రాంతాలకు ఎగుమతి చేయగలిగింది. మైకా విషయంలో కడచిన మూడు సంవత్సరాలలోను, భారతదేశపు ఉత్పత్తులలో ముప్పాతిక వంతు అమెరికాకే వెడుతున్నాయ్. మాంగనీసు కూడా అధికభాగం అమెరికాకే వెడుతున్నది. మాంగనీసును ఉక్కు తయారుచేయటానికి యెక్కువగా ఉపయోగింతురు.

ప్రస్తుతం మాంగనీసుమీద నూటికి పది పైసల రూపాయల ఎగుమతి పన్ను వుంది.

## హైదరాబాదు విలీనతకు విపుల సన్నాహములు

## రాజకీయ ఏకీకరణతో ప్రధాన పరివర్తనం

## 1950 ఏప్రిల్ నుండి సంస్థాన ఉద్యోగులకు ఇండియా కరెన్సీలో వేతనాలు

### త్వరలో నైజాం నవాబ్ ప్రకటన

[ఆంధ్రపత్రిక విలేఖరి]

హైదరాబాద్, నవంబరు 20: భారతసమాఖ్యలో అంతర్భాగంగా చేరిపోవటానికి హైదరాబాద్ సంస్థానం తయారవుతున్నది. ఈ సందర్భంలో అవసరమైన కార్యకలాపాలు బహుచురుకుగా లోలోపల కొనసాగుతున్నవని రూఢిగా తెలుస్తున్నది. 1950 ఏప్రిల్ 1 వ తేదీ నాటికి భారత రిపబ్లిక్ ఆర్థిక వ్యవస్థలో హైదరాబాద్ సంస్థానాన్ని విలీనం చెయ్యడం పూర్తి అవుతుందని నమ్మకంగా తెలియవస్తున్నది. (ఈ విషయమై మేజర్ జనరల్ చౌదరి ప్రకటన 6 వ పేజీలో ప్రకటింపబడినది). ప్రస్తుతం సంస్థానంలో చలామణీ అవుతూన్న హాలీశిఖా కరెన్సీని రద్దుచేసే విషయాన్ని భారత ప్రభుత్వం అతిశ్రద్ధగా పరిశీలిస్తున్నది.

ఈ కార్యక్రమానికి నాందిప్రాయంగా 1950 ఏప్రిల్ 1 నుండి సంస్థానంలోని ప్రభుత్వోద్యోగులకు, ప్రస్తుతమున్న మారకం రేటు ప్రకారం లెక్కచూసి ఇండియా రూపాయలల్లోనే వేతనాలు ముట్టచెబుతారని విశ్వసనీయమైన వర్గాల ద్వారా తెలుస్తున్నది. ఈమారకం రేటు 100 ఇండియా రూపాయలకు 116-10-8 హాలీశిఖా రూపాయలై ఉన్నది.

ఈ మారకం రేటులో విపరీతమైన మార్పు లేమీ సంభవించకుండా ప్రభుత్వమే దీనిని స్థిరీకరిస్తూ ఒక నిర్ణయాన్ని ప్రకటించవచ్చును. హాలీశిఖా కరెన్సీ రద్దు కార్యక్రమం ఒక్కసారిగా కాకుండా క్రమశః అమలులోకి వస్తుందనీ, కొంతకాలంపాటు రెండు కరెన్సీలు చలామణిలో ఉంటవనీ పర్యవసానంగా హాలీశిఖా నాణెం స్థానాన్ని ఇండియా నాణెం పూర్తిగా ఆక్రమిస్తుందనీ విజ్ఞులు భావిస్తున్నారు.

హాలీశిఖా కరెన్సీ రద్దు విషయమై నిజాంనవాబు అధికార ప్రకటన చేసేదాకా, విస్పష్టమైన [illegible] విషయంలో హైదరాబాదు సంస్థానానికి [illegible] అనుకూలాలు ఉంటాయనటానికి భారత ప్రభుత్వ అభిప్రాయం వెల్లడైనది. హైదరాబాదు విషయంలో మాత్రం యీ సుంకాలపద్ధతి సంస్థానానికి లాభసాటిగా ఉండటంవల్ల వీటిని వెంటనే రద్దుచేసే విషయంలో ప్రతిబంధకం ఏర్పడగలదేమో. ఒక్క కలంపోటుతో దీనిని రద్దు చేసినట్లైతే, సంస్థాన బడ్జెటులో ఆయవ్యయాలు సరిపుచ్చటం హైదరాబాద్ ఆర్థికమంత్రికి కష్టసాధ్యం కాగలదు.

ఆ సొంతానికి యీ సుంకాల విధింపు పద్ధతినికూడ పూర్తిగా రద్దు చెయ్యటానికి ఏ మార్గాల నవలంబిస్తే సక్రమంగా ఉంటుందో ఉన్నతాధికార్లు పరిశీలిస్తున్నారు.

ఇటీవల పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ సంస్థాన ఆర్థికమంత్రి, తమ ప్రభుత్వం కస్టమ్సు రద్దుకు సుముఖంగా వున్నదనీ, దాని సఫలతను గ్రహించిందనీ జరుగవలసిన కార్యక్రమాన్ని ఎప్పుడు, ఏ విధంగా అమలు చెయ్యాలన్నదే ప్రశ్న అని చెప్పుతున్నారు.

### కాంగ్రెస్ అర్హతా నిర్ణయ సంఘాలు

#### వివిధజిల్లాల్లో నియమిస్తూ రాష్ట్రసంఘ ప్రకటన

విజయవాడ, నవంబరు 19: చెరుకూరి వీరయ్యగారి అధ్యక్షత క్రింద సమావేశమైన ఆంధ్ర రా. కాం. సం. అర్హతా నిర్ణయ సంఘం ఆయా జిల్లాలకు ఈ క్రింద పేర్కొనబడిన కాంగ్రెసు అర్హతా నిర్ణయ సంఘాలను నియమించిందని నేడు ప్రకటింపబడింది.

తూర్పుగోదావరిజిల్లా— టి. సత్యనారాయణ (సమావేశకర్త) కొవ్వాడి లింగరాజు, నంబూరి జగ్గరాజుగార్లు.

పశ్చిమగోదావరి—భోగరాజు బుచ్చిరామయ్య (స. క), కామాక్షిరెడ్డి బ్రహ్మయ్య, గోదా రఘునాయకులుగార్లు.

తూర్పుకృష్ణా—యెనిగళ్ళ వెంకట్రామయ్య (స. క.) కాజ సుబ్రహ్మణ్యం, కోసూరి రత్తయ్యగార్లు.

పశ్చిమకృష్ణా—నన్నపనేని మల్లయ (స. క.) బొబ్బ వాసుదేవ ప్రసాదరామయ్య, చోడవరపు మనుమూనవరావుగార్లు.

నెల్లూరు—బెజవాడ వెంకటకృష్ణారెడ్డి (స. క.) దేశభొట్ల రంగయ్య, మరుపూరి పిచ్చిరెడ్డిగార్లు.

కర్నూలు—వై రెడ్డి చినవెంకటరెడ్డి (స. క.) ఎన్. బలనారాయణరెడ్డి, గుంపెళ్ల సత్యనారాయణగార్లు.

ఆంధ్ర బళ్లారిజిల్లా :- కె. బి. మాధవ్ (స. క.) వి. హెచ్. రామశర్మ, కె. ఎల్. ఎన్. సోమయాజులుగార్లు.

చిత్తూరు :- జి. రామచంద్రనాయుడు, (స. క.) పి. నరసింహారెడ్డి, కె. రాజగోపాలాచారియార్‌గార్లు.

అనంతపురం :- జోగన్నపేట వెంకటరెడ్డి, (స. క.) ఎమ్. ఎస్. అశ్వత్థయ్య, టి. చంద్రశేఖర రెడ్డిగార్లు.

కడప :- ఆర్. వెంకటసుబ్బారెడ్డి, (స. క.) పి. లక్ష్మయ్య, లింగిరెడ్డి రామసుబ్బారెడ్డిగార్లు.

గుంటూరు, ఉత్తర, దక్షిణ విశాఖ జిల్లాలకు అర్హతా నిర్ణయసంఘములు నియమింపబడలేదు.

ఆంధ్రలోని రాష్ట్ర, జిల్లా అర్హతా నిర్ణయసంఘాలకు నిబంధనావళి కూడా నిర్ణీతం చేయబడినది.

### రష్యా తూర్పు జర్మనీలలో పరస్పరవాణిజ్యప్రతినిధులు

బెర్లిన్, నవంబరు 19: రష్యా యూనియను, తూర్పుజర్మనీ ప్రభుత్వాలు పరస్పర వాణిజ్య ప్రతినిధుల నియామకం చేసుకోవటానికి అంగీకరించినట్లు తూర్పు జర్మనీ విదేశాంగ శాఖవారు ప్రకటించారు.

## చుంకింగ్ కి 60 మైళ్లలో కమ్యూనిస్టు సేన

### క్వేయిచౌ రాజధాని పతనం

హాంకాంగ్, నవంబర్ 19 : కొమింటాంగ్ ప్రస్తుత రాజధాని చుంకింగ్ కి 60 మైళ్ళ దూరానికి తమసేనలు వెళ్లినవని కమ్యూనిస్టు ప్రభుత్వ రేడియో నేడు వెల్లడించినది.

హూపే, హూనాన్ రాష్ట్రాల నుండి తూర్పు జెక్వాన్ రాష్ట్రంలోకి జొరబడి తమసేనలు రహదార్ల మీదుగా పురోగమిస్తున్నవని ఆ ప్రకటన వెల్లడించినది.

తూర్పున హూపేనుంచి పడమరగా కమ్యూనిస్టు ఒంటికంటిసేనాని లియూపో చెంగ్ సేనలు, వాయవ్య దిక్కు నుంచి హూనాన్ మీదుగా తోసుకునివస్తున్న లిన్‌పియాన్ సేనలు, క్వేయిచే రాష్ట్రం నుంచి ఉత్తరంగా తోసుకునివస్తున్న ఇతర కమ్యూనిస్టుబలాలు, చుంకింగ్ మీదికిమూడు వైపులనుంచీ దూకుతున్నవి.

క్వేయిచేరాష్ట్ర రాజధాని క్వేయాంగ్ ను ఆక్రమించుకున్న కమ్యూనిస్టుసేనలు అక్కడనుంచి దక్షిణానికీ, పడమరకూ పురోగమిస్తున్నవనికూడా కమ్యూనిస్టు రేడియో వెల్లడించింది.

### రిపబ్లికన్ సైన్యంలో అంతఃకలహం?

#### తూర్పు జావాలో ప్రజ్వరిల్లినట్లు వార్త

బటేవియా, నవంబర్ 19 : తూర్పు జావాలోని పోరుంగ్, మాలాంగ్ ప్రాంతాల్లో రెండు రిపబ్లికన్ పటాలాలమధ్య నిన్న తీవ్రపోరాటం ప్రారంభమైనదని రిపబ్లికన్ సైనికవర్గాలు నేడు వెల్లడిస్తున్నవి. రిపబ్లికన్ పటాలాలు తమలోతాము కలహించటం గడచిన రెండు రోజుల్లోనూ ఇది రెండవసారి. అని వారు తెలియజేశారు.

నవంబర్ 16 వ తేదీన రెండు రిపబ్లికన్ పటాలాలు తూర్పుజావా రిపబ్లికన్ సేనాని సుంకొంగ్ ఆజ్ఞలను ఉల్లంఘించగా అతడు వారిని మరి 8 పటాలాలు తీసుకొని కొండకోండలలోకి తరిమివేశాడనీ, వాళ్లు నిన్న ఉదయం ఈ ఎదురుదాడిని జరిపారనీ తెలుస్తున్నది. 16 వ తేదీ పోరాటంలో ఉభయపక్షాలలో నూ మొత్తం 250 మంది నాశనమైనారని తెలుస్తున్నది. ఎదురుతిరిగిన పటాలాల నాయకుడు వారూ ఇదివరకు కమ్యూనిస్టు గెరిల్లా దళ సభ్యుడుగా ఉండేవాడనీ, పోరుంగ్ ప్రాంతాన్ని ఖాళీ చేయమన్న ఆజ్ఞను నిరాకరించాడనీ తెలుస్తున్నది. మలాంగ్ ప్రాంతంలో గెరిల్లాదళాలు చాల ఉధృతంగా ఉన్నవి.

### నెహ్రూకు లిబియా ప్రతినిధి కృతజ్ఞత

న్యూఢిల్లీ, నవంబర్ 19 : ట్రిపోలీటేనియా జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులూ, ఐక్యరాజ్య సమితిలోని లిబియన్ ప్రతినిధివర్గ నాయకులూ అయిన బషీర్ సిదావీ, భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకు యీ దిగువ తివార్తను అందజేశారు.

'సమైక్యతతోనూ, స్వతంత్రంగానూ ప్రతకాలని లిబియాకుగల న్యాయమైన ఆశయాలను బలపరచి భారత ప్రభుత్వమూ, ప్రజలూ, ఆసియా ఆఫ్రికా ఖండముల విముక్తికి భారతదేశం పూనివున్న నాయకత్వాన్ని స్థిరీకరించుచున్నారు. భారత ప్రతినిధి సర్ బెనిగల్ రామారావుగారు మాకు చేసిన మహత్తరమైన సహాయసహకారములకు మా ప్రతినిధి వర్గమూ, లిబియా ప్రజలూ కృతజ్ఞత తెల్పుతున్నారు.

శ్రీ రామారావుగారు మా ఆశయాలపట్ల చూపిన సానుభూతికి లిబియా, భారతదేశమునకు సర్వదా కృతజ్ఞతలో నుండగలదు!

## రాష్ట్రశాసనసభల కాంగ్రెస్‌పక్ష నాయకుని ఉద్యోగ కాలపరిమితి

### కొత్త అసెంబ్లీ ఎన్నికయేవరకూ ఒకే వ్యక్తి నాయకత్వం వహించాలని పార్టీ నిర్ణయం

మదరాసు, నవంబరు 20 : అసెంబ్లీ జీవితముతో పార్టీనాయకుని ఉద్యోగ కాలమును సరిసమాన మొనర్చుచూ పార్టీ నియమావళిలో నాయకుని ఎన్నికకు సంబంధించిన నిబంధన సవరణను నిన్న శాసనసభా కాంగ్రెసుపక్షము ప్రత్యేకముగా సమావేశమై అంగీకరించెను.

కాంగ్రెసు కార్యవర్గము అక్టోబరు 7న ఆమోదించిన కేంద్ర పార్లమెంటరీబోర్డు వారి తీర్మానము ననుసరించి ఈ సవరణ తీసుకొనిరాబడెను.

పార్లమెంటరీ బోర్డు వారు "రాష్ట్ర శాసనసభా జీవితముతో శాసనసభా కాంగ్రెసుపక్షనాయకుని ఉద్యోగకాలము సమానముగ వుండవలెనని" తీర్మానించిరి.

పార్టీ కార్యవర్గము నవంబరు 6 తేదీన పై తీర్మానమును అంగీకరించి తదనుగుణ్యముగా పార్టీనియమమును సవరించవలెనని పార్టీకి శిఫార్సు చేసెను.

నిన్న సాయంత్రము సమావేశములో పక్షనాయకుడు "అసెంబ్లీ జీవితము అంతకూ ఒకే నాయకుని ఎన్నుకొనవలెను" అనే తీర్మానము ప్రతిపాదించి పార్టీనియమము 5 ను సవరించవలెనని కోరిరి.

కార్యనిర్వాహకులను తొలగించుటకు సంబంధించిన నియమమునకు శ్రీ కె. ఆర్. కరంత్ సవరణ ప్రతిపాదించిరి. "హాజరైన సభ్యులలో మెజారిటీనిబట్టి తొలగించవచ్చును" అనేది వారి సవరణ సారాంశము.

ప్రస్తుతము హాజరయినవారిలో 2/3 మెజారిటీగాని, మొత్తం సభ్యులలో మెజారిటీగాని నాయకుని తొలగించుటకు అవసరం. శ్రీ కరంత్ తన సవరణ ఉద్దేశ్యమును వివరించినతరువాత నాయకుడు ఈ సవరణ ప్రధానమార్పు ఉద్దేశించుచున్నదనీ సరియైన నోటీసుఇచ్చి మరొక ప్రత్యేక సమావేశమున చర్చించవలసినదని చెప్పి సవరణ క్రమవిరుద్ధమని త్రోసివేసిరి.

అంతట "అసెంబ్లీ జీవితమునకు ఒక నాయకుని ఎన్నుకొనవలెను" అను ప్రతిపాదన ఏకగ్రీవముగా అంగీకరించబడెను.

శాసనసభా కాంగ్రెసుపక్ష నాయకుడు శ్రీ ప్రకాశం కుమారస్వామిరాజాగారు అధ్యక్షతవహించిరి. మొత్తము 201 మంది సభ్యులకు 116 గురు హాజరైరి.

## కాశ్మీర్ కమిషన్ సైనిక సలహాదారు డెల్వాయ్ రాజీనామా

### శ్రీనగర్ నుంచి రావల్పిండికి ఆభరణాలు చేరవేసిన "ఘనుడు"

న్యూయార్కు, నవంబరు 19 : కాశ్మీర్ కమిషనుకు సైనిక సలహాదారు లెఫ్టినెంట్ జనరల్ డెల్వాయ్ రాజీనామా ఇచ్చారని రూఢిగా తెలుస్తున్నది. ఐక్యరాజ్యసమితి కార్యదర్శి ట్రిగ్వేలీ ఈ రాజీనామాను అంగీకరించారని కూడా తెలుస్తున్నది.

ఈయన శ్రీనగర్‌లోని లాయడ్స్ బ్యాంక్‌నుండి బేగమ్ ఎఫెండీకి సంబంధించిన నగల పెట్టెలను రావల్పిండికి చేరవేశారనే నింద మోపబడింది. ఈ నగల పెట్టెలను కాశ్మీర్ ప్రభుత్వం స్వాధీనం చేసుకోబడిన ఆస్తిగా ప్రకటించింది. జనరల్ డెల్వాయ్ ఈ నగలపెట్టెలను బయటకొట్టి ఈ నగలను రావల్పిండి చేరవేశాడనే నింద మోపబడింది. కాశ్మీర్ ఉపప్రధానికీ, జనరల్ డెల్వాయ్ కీ మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలలో జనరల్ డెల్వాయ్ 7 నగల పెట్టెలను తదితర వస్తువులను [illegible]

లేక్ సక్సెస్ నుండి ఐక్యరాజ్యసమితి ప్రముఖుడు ఒకడు మాట్లాడుతూ జనరల్ డెల్వాయ్ చేసే 12 నెలల ఉద్యోగము రేపు నవంబరు నెలాఖరులో పూర్తికాగలదని మాత్రమే చెప్పాడు. ఈ ప్రముఖుడు డిసెంబరులో కాశ్మీర్ కమిషను నివేదిక తయారు చేయగలదనీ, కమిషను సభ్యులు అవసరమయితే నివేదిక చర్చించే సమయంలో లేక్ సక్సెస్‌లో హాజరుగా వుండగలరనీ కూడా చెప్పారు.

### రోమ్‌లోని భారత రాయబారి దివాన్ రామ్‌లాల్ మరణం

రోమ్, నవంబరు 20 : ఇటలీలోని భారత రాయబారి దివాన్ రామ్‌లాల్‌గారు ఇక్కడ నేటి తెల్లవారుఝామున 3-30 గంటలకు గుండెపోటువల్ల మరణించారు.

## ఆయుధముల కంట్రోలు ప్రయత్నాన్ని భద్రతామండలి విరమింపరాదు

### సమితి రాజకీయ సంఘ తీర్మానం

లేక్ సక్సెస్, నవంబరు 19: "ప్రపంచ దేశాలు వాడే ఆయుధాలను క్రమబద్ధంచేసి ఆయుధమొత్తాలను తగ్గించేనిమిత్తం తాను చేస్తున్న ప్రయత్నాలను భద్రతామండలి విరమించకుండా కొనసాగించాలి," అనిసమితి అదనపు రాజకీయ సంఘంలో నార్వే, ఫ్రాన్సులు నేడు ప్రతిపాదించిన తీర్మానం ఆమోదించబడినది.

సాధారణ ఆయుధ వివరాలతో పాటుగా అటం ఆయుధాల వివరాలనుకూడా సమితికి సభ్యదేశాలన్నీ సమర్పించాలని రష్యాచేసిన ప్రతిపాదన వీగిపోయింది.

### బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ ప్రతినిధి వర్గం

బొంబాయి, నవంబరు 19: బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ వారు ముగ్గురు సభ్యులతో, భారతదేశానికి ఒక రాయబారవర్గాన్ని పంపుతున్నారు. వీరు క్రొత్త సంవత్సరం మొదటి రోజుల్లో వస్తారు. వీరు భారతదేశంలోని ట్రేడ్ యూనియన్ సంస్థలతో పరిచయం చేసుకుంటారు. ఈ వార్త హిందూ మజ్దూర్ సంఘంకేంద్రకార్యాలయంలో తెలిసింది.

## రేడియో ప్రోగ్రాం

నవంబరు 22 మంగళవారం

### మద్రాసు (ఎ)

ఉ॥ 7-30 వెంకోత్త నారాయణ పాట 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయగానం రికార్డులు. 8-30 మద్రాసు (బి) వలె. మ॥ 1.0 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం రికార్డులు. 4-30 పాశ్చాత్య సంగీతం రికార్డులు. సా॥ 5-30 మద్రాసు బాల కృష్ణయ్యర్ వయొలిన్. 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 తిరువళ్లూర్ వీరరాఘవన్ పాట. 7-30 గీతమంజరి రికార్డు 7-45 మన్నార్‌గుడి రాజగోపాలపిళ్లై పాట 9-0 ఆంగ్లమున వార్తలు. 9-30 మద్రాసు (బి) వలె. 10-0 వాద్యసంగీతం రికార్డులు.

### మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వార్తలు. 7-15 విజయలక్ష్మి రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 పి. యస్. సరోజని మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలావిద్యార్థులకు ప్రసిద్ధ వైజ్ఞానికులు, శ్రీరాస్ ప్రసంగం. వసంతరావు వెంకట్రావు ప్రశ్నలు జవాబులు ఆంధ్ర మహిళా సభ పాఠశాలావిద్యార్థినులు. 1-0 మహిళామండలి నానాదేశ నృత్యవేదిక వయొమిస్ ప్రసంగం ఎస్. సామ్రాజ్యం ఇది చేసిచూడండి గుజరాతీ భక్ష్యాలు ప్రసంగం ఎస్. సి. ద్వారకాబాయి 1-30 మద్రాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు భర్తృహరి సుభాషిత రత్నావళి సత్యము ప్రసంగం మనసంగీతం 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు ప్రపంచపు ఎడారులు కలహారి ఎడారి ప్రసంగం డి. సీతారామశాస్త్రి, మనదేవాలయాలు తంజావూరు దేవాలయము ప్రసంగము వి. కామరాజు సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం ‘బొమ్మలాట’ బృందగానము ఉద్ధరించవలసిన గ్రామ వినోదాలు తోలుబొమ్మలాట ప్రసంగం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణ వివరాలు 7-0 తెలుగున వార్తలు 7-15 రాష్ట్రపరిపాలనా విషయాలు మద్రాసుప్రభుత్వ అభివృద్ధి ప్రణాళికపై ప్రసంగం 7-45 మద్రాసు (ఎ) వలె 9-30 ఎస్. ఆర్. జానకిరాం పాట 10-0 మద్రాసు (ఎ) వలె.

### విజయవాడ

ఉ 7-0 తెలుగున వార్తలు 7-15 ఎస్. వి. సుబ్బయ్య భాగవతర్ రికార్డులు 7-30 కోమ్మర్రు నాగభూషణం నాదస్వరం 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 చల్లపల్లి రామచంద్రశాస్త్రిపాట మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 శారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా 5-30 కోమ్మర్రు నాగభూషణం నాదస్వరం 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 గీతమంజరి. సూర్యకుమారి రికార్డులు 6-30 గ్రామస్థులకు కార్యక్రమము (మద్రాసునుండి) 7-0 తెలుగున వార్తలు 7-30 ముచ్చిపల్లి రామమూర్తి వయొలిన్ 7-45 అజీం ఖాన్ సితార్ 8-0 శారుణి నాటిక రచన ‘రావూరు’ 8-30 చల్లపల్లి రామచంద్రశాస్త్రిపాట 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 విశ్వవిద్యాలయాలకు భారత వేదాంతం రామానుజ ప్రసంగం. వి. వి. రామానుజస్వామి 9-30 చిత్రవాణి (రి).

### హైద్రాబాదు

ఉ. 7-30 శ్రీమద్భగవద్గీత, పండిట్ రామనివాసశర్మ. 7-45 సునందా దేవి భజన్. 8 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే.) 8-20 శ్రీ మద్భగవద్గీత తెలుగువ్యాఖ్యతో. కె. వి. ఎన్. శాస్త్రి. 8-50 తెలుగున వార్తలు. 9-15 అజ్మత్ బాలుఖాన్ ఖయాల్ ఫీంహతితే డి. మ. 12-30 భజనమాల (రి.) 1 టి. సూర్యకుమారి రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) సా. 5 మహిళామండలి తెలుగున వివిధశీర్షికలలో ప్రోగ్రాము. (1) వైద్య ప్రసంగం, శ్రీమతి లతాదేవరత్నం. ‘పచ్చబంగీ’ కథ, రచన. వి. సరస్వతీదేవి, కర్నాటక సంగీతం. [illegible] (6) చర్చ్మ జబ్బులు ప్రసంగం. ఎ. శారదాదేవి. 5-45 సత్యనారాయణ గీత్. 6-30 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున. చేతికాగితం పరిశ్రమ, సంభాషణ, గీతావళి. ఎం. వెంకట్రావు. 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే.) 7-45 హైద్రాబాదులో కళా కేంద్రాలు. ‘భువనగిరి’ తెలుగున ప్రసంగం. ఎ. వీరభద్రరావు. 7-55 సత్యనారాయణ [illegible] కేంద్. 8-30 అజ్మత్ హుస్సేన్‌ఖాన్, ఖయాల్ సాదనిక [illegible]. 8-50 సునందాదేవి, మురాళీవనం. 9 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) 9-15 ‘[illegible]’ రూపకం తెలుగున. రచన, ఎ. స్వరాజ్యలక్ష్మి. 9-55 అజ్మత్ హుస్సేన్‌ఖాన్ ఖయాల్ [illegible]. 10-25 సత్యనారాయణ గీత్. 10-25 సునందాదేవి గీత్. 10-55 అజ్మత్ హుస్సేన్‌ఖాన్ ఖయాల్ [illegible].

# “సోషలిస్టు రిపబ్లిక్ స్థాపనకూ ఈ రాజ్యాంగం దోహదమిస్తుంది”

## ముసాయిదా ప్రతిపాదనపై పరిషత్తు చర్చలో సంతానంగారి సమర్థన

న్యూఢిల్లీ, నవంబరు 19: “ఈ రాజ్యాంగంతో భారత ప్రజానీకం ఏమిచేసినా చేయవచ్చు. ఇచ్చట సోషలిస్టు రిపబ్లిక్‌ను స్థాపించాలన్నా ఈ రాజ్యాంగం అందుకు దోహదంఇస్తుంది.” అని శ్రీ సంతానం ఇవ్వాళ జరిపిన చర్చలకు సమాధాన పూర్వకంగా ఇచ్చిన ఉపన్యాసంలో అన్నారు.

మనకు ఇప్పటినుంచి రాజ్యాంగంపట్ల భక్తి ప్రపత్తులు ప్రబలంగా వుండాలి. అదిపవిత్రమైనదన్న భావం మనలో తీవ్రంగా పాదుకోవాలి. అప్పుడు దాన్ని ఏశక్తి ఏమీచేయలేదు. అని ఆయన సభ్యులకు ఒక విజ్ఞప్తిచేశారు.

ఈ రాజ్యాంగంలో ప్రతిపాదించబడిన ప్రజాస్వామ్యం, ఏ ఇతర రాజ్యాంగంలోని దానికి తీసిపోదని అంటూ, ఇది ఎట్లా పనిచేస్తుంది? ఈ ప్రజాస్వామ్యాన్ని ఒక రాజకీయ విషయాల్లోనే గాక, పారిశ్రామికవిషయాల్లోను, సామాజిక విషయాల్లోను గూడా ఎంతవరకు పట్టించగలం? అన్న ఈ విషయాలన్నీ గూడా ప్రజలమీద, ప్రజానాయకుల శక్తిమీద ఆధారపడి వుంటాయి. పోతే మన రాజ్యాంగంలో ప్రజాస్వామ్యం సమగ్రంగా ప్రపంచించబడింది. అని శ్రీ సంతానం స్పష్టంచేశారు.

ఇవ్వాళ పరిషత్తులో రాజ్యాంగం మీద చర్చ శ్రీ హెచ్. వి. కామత్ ప్రారంభించారు. ఆయన రాజ్యాంగాన్ని అనోమా స్వరంగా బలపరిచారు. రాజ్యాంగం పీఠికలో వున్న ఉన్నతాశయాలు రాజ్యాంగంలో బాగా ప్రతిఫలించలేదని శ్రీ కామత్ వాదించారు.

శ్రీ హెచ్. కామత్ కన్నా నేతి దామోదర స్వరూప్ రాజ్యాంగాన్ని తీవ్రంగా విమర్శించారు. రాజ్యాంగ పరిషత్తులోవున్న సోషలిస్టుపార్టీ సభ్యుడు ఆయన ఒక్కరే.

సేక్ దామోదర్ ఈ రాజ్యాంగం పెట్టుబడిదార్లకు, జాగీర్దార్లకు స్వర్గోపమంగా వుంటుందన్నారు. దేశంలో సోషలిజం వ్యాప్తిలోకి రాకుండా చేయడానికి నిర్మించిన ఒక వారాధిలాగా ఈ రాజ్యాంగం వున్నదని ఆయన వాదించారు.

సోషలిస్టు పార్టీ గనుక అధికారంలోకి వచ్చినటయితే కొత్తరాజ్యాంగ పరిషత్తు నువయోజన ఓటింగ్ పద్ధతిమీద ఏర్పాటుచేసి, ఈ రాజ్యాంగాన్ని పూర్తిగా నన్నా మారుస్తుంది. లేకపోతే వేరే కొత్త రాజ్యాంగాన్ని సృష్టిస్తుంది. కాని ఈ రాజ్యాంగం మాత్రం చాలా అధ్వాన్నంగా వుంది. ప్రజలు ఎటువంటి ఆశలు పెట్టుకొని వున్నారో ఆ ఆశలన్నింటిని ఈ రాజ్యాంగం కాలదన్నుతున్నది. ఇందులో కేంద్రానికి ఏకచ్ఛత్రాధిపత్యం కట్టబెట్టారు. అది ఫాసిజంకు దారితీసినా తీస్తుంది. ఇప్పుడు ఈ పరిషత్తులో ఈ రాజ్యాంగం నెగ్గితే నెగ్గుతుంది కాక, ప్రజాభిప్రాయానికి వదిలి పెడితే, వారు దీన్ని బుట్టదాఖలు చేస్తారు.

ఈ రాజ్యాంగంలో ఒకటి కాదు, రెండుకాదు, చాలా దోషాలు వున్నాయి. కష్టపడి పనిచేసుకునే వారికి ఇందులో రక్షలేదు. కార్మికుల జీవన ప్రతికాని సరి తూగే జీతన నిర్ణయంలేదు. తిండి లేక, గుడ్డలేక అలమటిస్తు జనానికి ఆధారంగా ఈ రాజ్యాంగంలో కంచుకాగడా పెట్టి వెదికినా ఒక్క ముక్క కనపడటం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ రాజ్యాంగం చిత్తు కాగితం. దీన్ని నిర్మించిన వాళ్ళెవరూ ప్రజలకు ప్రాతినిధ్యం వహించేవాళ్లు కాదు.

మూల స్వత్వాలను నామ మాత్రంగా ఇచ్చి, ప్రజలకంఠాలో దుమ్ముకొట్టాలని ఈ రాజ్యాంగం చూస్తున్నది. అందువల్లనే సోషలిస్టు పార్టీ తను అధికారంలోకి వచ్చినప్పుడు, ఇంకో పరిషత్తును ఏర్పాటు చేసి. దేశానికి కొత్తరాజ్యాంగాన్ని ప్రసాదిస్తానని ప్రకటించివుంది.

సేఠ్ దామోదరస్వరూపకంటే ముందు శ్రీ హెచ్. వి. కామత్ మాట్లాడారు: వింధ్య ప్రదేశ్‌కు, హైద్రాబాదుకు ప్రాతినిధ్యం లేకుండా రాజ్యాంగంమీద వాళ్ళ పాటి పరిశీలనకూడా పూర్తికావడం బాగుండలేదని ఆయన అన్నారు. అయినా ప్రజలు, ప్రజాప్రతినిధులు ఈ రాజ్యాంగాన్ని క్రమంగా అమలు జరిపి, సామాన్య ప్రజానీకం భోగభాగ్యాలతో తులతూగేటట్లుచేసి, సర్వ ప్రపంచానికి సనాతనమైన భారతశాంతివాదాన్ని సమర్పించగలరని ఆశిస్తున్నామని శ్రీ కామత్ చెప్పారు.

శ్రీ దామోదర్ స్వరూప్ అనంతరం శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు గారు మాట్లాడారు. ఆయన భారత రాజ్యాంగం పంచాయతీ రాజ్యం ప్రాతిపదికగా ఏర్పడుతుందని ఆశించారు. అది మహాత్ముని సిద్ధాంతాలకు దగ్గర విషయమని, ఈ పరిషత్తు అందుకు అనుకూలంగా వర్తించక పోవడం విచారకరమని ఉద్ఘాటించారు.

ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి సర్దార్ పటేల్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూలు అనుమతించనందుకు హర్షాన్ని వెలిబుచ్చారు.

శ్రీ సిబ్బన్‌లాల్ సాక్సేనా మాట్లాడుతూ, దేశ విభజనవల్ల చాలా నష్టాలు వున్నాయని, ఇండియా, ఇండియాగా, పాకిస్తాన్, పాకిస్తాన్‌గా వున్నంతకాలం దేశానికి శాంతి వుండదని అన్నారు.

భారత రాజ్యాంగాన్ని ఒక పరిష్కార మార్గంగా ఆయన వర్ణించారు. ఇప్పుడు కాలం ఒక పరివర్తనలోవుంది. ఈ పరివర్తన పూర్తి అయిన తరువాత, తిరిగి ప్రజాప్రతినిధులంతా కూడి ఈ రాజ్యాంగం తమ ఆశయాలకు అనుగుణంగా మార్చగలరని నేను ఆశిస్తున్నాను అని ఆయన అన్నారు.

రాజ్యాంగంలో కొన్ని లోపాలు వున్నా, ప్రస్తుత పరిస్థితులలో ఇంతకన్నా మంచి రాజ్యాంగాన్ని నిర్మించడం కష్టమని రివరెండ్ నికొలస్‌రాయ్ అన్నారు.

డా॥ హెచ్. సి. ముఖర్జీ, రాజ్యాంగంలో ప్రత్యేక ప్రాతినిధ్యాలు రద్దుకావడం హర్షించదగిన విషయం అన్నారు. గోవధను గూర్చి వున్న అంశాలను పేర్కొంటూ, పాడిఆవుల విషయంలో అది వర్తిస్తే వర్తించవచ్చుగాని, తిండి, తిప్పలు లేక తిరుగుతూవుండే గొడ్డుమోతు ఆవుల విషయంలో దీన్ని వర్తింపజేయడం అంత బాగుండదని ఆయన చెప్పారు.

భాషాసమస్యను పరిష్కరించిన విధం తనకు నచ్చలేదని డా॥రఘువీర్ అన్నారు. భారత సంస్కృతికి, భారత సంప్రదాయాలకు రాజ్యాంగంలో స్థానం లేకపోవడంగూడా విచారించదగిన విషయమేనని ఆయన అభిప్రాయ పడ్డారు.

రాజ్యాంగంలో రాజకీయమైన హక్కులను మూలస్వత్వాలలో పేర్కొని, ఆర్థికంగా రూపకములైన హక్కులను సూచనప్రాయంగా పేర్కొనడం తనకంతగా నచ్చలేదని శ్రీమతి రేణుకారే రాజ్యాంగాన్ని విమర్శించింది. భూమి సంపాయించడం, ఆస్తిని నిలబెట్టుకోవడం మొదలైనఅంశాలను మూల స్వత్వాలలో చేర్చిన కారణంగా రాజ్యాంగం తన పీఠికకే తాను వ్యతిరేకంగా నడిచినట్లయినదని ఆమె అన్నది. అయినా అంత మాత్రంచేత ఎవరూ నిస్పృహ చెందవలసిన అవసరం లేదని, ముందుముందు పార్లమెంటులు ఈ రాజ్యాంగాన్ని సరిగ్గామార్చగల అవకాశం దాంట్లోనే వున్నదని అన్నది.

సంతానం మాట్లాడుతూ, ఈ రాజ్యాంగంలో రాష్ట్రీయ స్వయంపాలనాధికారం సంకుచిత పరచబడిందని పటాస్కర్ ప్రభృతి సభ్యులు చేసిన విమర్శ సరియైనది కాదని, రాజ్యాంగాన్ని సరిగ్గా పరికిస్తే ఆ అధికారం ఏమాత్రం కుంచింపబడలేదు సరిగదా, దానికి ఇందులో మంచి ప్రోద్బలం కల్పించబడిందని అర్థం తేటతెల్లమవుతుందని అన్నారు.

రాజ్యాంగరచనా వ్యవహారం అంతా చాలా బాగావున్నదని, అందులో సభ్యులు ముఖ్యంగా పాటించవలసిన విషయం సంస్థానాలకు, కేంద్రానికివుండే సంబంధాలను గూర్చినదని శ్రీ సంతానం అన్నారు. రాజ్యాంగం అమలులో 3 భాగాలే భారత సంస్థాన శాఖవారు వివిధ సంస్థానాలతోను ఏర్పాటు చేసుకున్న సమాధానాలు గద్దెయి పోతాయి. అనాటి నుంచి దేశంలో సార్వభౌమత్వం అనేది ప్రజలపరమై పోతుంది. ఇందులో సంస్థాన ప్రజ అని, ఇంకో ప్రజ అని భేదంలేదు. అందువల్ల దేశవిభజనకుగాని, ఒక ప్రాంతం దేశం విడిపోవడానికిగాని ఇక ముందు ఎటువంటి ఆస్కారమున్నా లేదు. ఒక సంస్థానాధిపతి పూర్వంలాగా నేను ఇండియాలో వుండను అని అనసాహసించలేడు. అతనికి ఎటువంటి అధికారమున్నా వుండదు, అధికారమంతా ప్రజలదే అని ఆయన స్పష్టంచేశారు.

రాజ్యాంగంలో కొన్ని లోపాలు వుంటే వుండవచ్చును. అట్లా లేదని ఎవరు అన్నారు. ముందుముందు వాటిని కొన్ని సవరణలతో సర్దుబాటు చేసుకోవచ్చును. అయినా కొన్ని ఏండ్లపాటు అటువంటి సవరణలుకూడా అవసరమని నాకు అనిపించడంలేదు.

ఈ సందర్భంలో నేను ఒక సూచన చేయదలచుకొన్నాను. రాజ్యాంగం ప్రతిప్రతి అధ్యక్షుని సంతకముతో ఒకొక్క సభ్యుడికి ఒకొక్క ప్రతి అందచేయాలి. అతను దాన్ని తన తరువాతితరంవారికి, అతను ఆ తరువాతి వారికి అందజేస్తూ పోవాలి. ఇట్లా కొన్ని ప్రజా సంస్థలకుగూడా దీన్ని పంపాలి. విశ్వవిద్యాలయాలలో రాజ్యాంగాన్నిగూర్చి కొన్ని ఏండ్లపాటు పాఠాలు బోధించాలి. దీన్ని నిష్పక్షంగా చెయ్యాలి.

దేశంలో త్వరలో ఎన్నికలు జరగడం కూడా ఆవశ్యకం. మనం ఆలస్యంచేస్తే 1951 దాటి మాత్రం పోరాదు. రాజ్యాంగం అమలు జరగడానికి, దాన్ని కొత్త పార్లమెంటు అంగీకరించడానికి కాలంలో వ్యత్యాసం ఏర్పడితే, రాజ్యాంగం పస తగ్గిపోయి, ప్రజలకు దీనిమీదవున్న ప్రేమ సన్నగిల్లి పోతుంది.

ఈ రాజ్యాంగాన్ని పరిషత్తులోనే గాక, పరిషత్తు కాంగ్రెస్ సమావేశాల్లో గూడా బాగా ఆలోచించడం జరిగింది. కాంగ్రెసుపార్టీలో ఆలోచనమే సరిగ్గా లేకపోతే, ఈ రాజ్యాంగం ఇప్పటిలాగా వుండేదికాదు.

ముందు తరాలవారు దీనిని చాలా ఘనముగా గ్రహించగలరని నేను ఆశిస్తున్నాను.

ఇవ్వాళ్టి మధ్యాహ్నం పరిషత్తు సమావేశం జరుగలేదు. పరిషత్తు తిరిగి సోమవారంనాడు సమావేశమౌతుంది.

# నూత్న రాజ్యాంగంలో తాత్వికదృష్టి లోపం

## ఆగ్రా స్నాతకోత్సవంలో డా॥ సంపూర్ణానంద్ ప్రసంగం

ఆగ్రా, నవంబరు 19: యు. పి. విద్యామంత్రి డాక్టరు సంపూర్ణానంద్ ఈవేళ ఇక్కడ ఆగ్రా విశ్వవిద్యాలయం పట్టభద్రుల స్నాతకోత్సవ సభలో ప్రసంగిస్తూ దేశీయ విద్యావిధానానికీ, దేశీయరాజ్యాంగానికీ, తాత్త్వికమైన పునాది ఉండాలని అన్నారు. ఈ తాత్త్వికమైన ఆధారం మన రాజ్యాంగానికి లేకపోవడం ఒక పెద్దపొరబాటనికూడా ఆయన అభిప్రాయపడ్డారు. మన రాజ్యాంగ నిర్మాణాన్ని గురించి మాట్లాడుతూ ఆయన ఇంకా ఇలాగ అన్నారు.“ఇంగ్లండుఅమెరికాల రాజ్యాంగాలలోనించి, ఏవో కొన్ని సూత్రాలు ఎరువు తెచ్చుకోవడంవల్ల రాజ్యాంగరచన సంపూర్ణం కాజాలదు. రాజ్యాంగరచించేటప్పుడు కొంత విస్పష్టత అవసరమే. కాని, అన్ని విషయాలు అందులో చేర్చాలనే తహతహవల్ల ఈ రాజ్యాంగంలో విస్తరణానకాశంలోపించింది. అదీగాక ఈ రాజ్యాంగంలో మరి ఒక పెద్దలోపం ఉన్నది. ఇందులో అధికారం అంతా కేంద్రానికి హస్తగతం చెయ్యడమూ. రాష్ట్రాలను కేంద్రం చేతిలో కీలుబొమ్మలుగా చెయ్యడముకూడా జరిగింది.”

తరువాత ఆయన ఇంకా మాట్లాడుతూ, మన రాజ్యాంగంలో ‘ప్లానింగు’లేకపోవడం ఒక పెద్ద లోపమనీ, పట్టభద్రులకు జ్ఞానోపార్జనతోబాటు పరిస్థితులను అవగాహన చేసుకునే శక్తి, చక్కని సత్ప్రవర్తనా కూడా ఉండాలి. అదేగాక ఓరిమి సహన శక్తికూడా చాలా అవసరం.”

ఆతరవాత ఆయన సామ్యవాద ఆర్థిక వ్యవస్థ దేశానికి చాలా అవసరమనీ, దీనివల్లనే మన దేశానికి సాటి దేశాలలో గౌరవం లభించగలదనీ అన్నారు.

ఆతరవాత కాశ్మీరు సంస్కృత కళాశాల ఒక విశ్వవిద్యాలయంగాను, హుకర్ కాలేజీ, మరి ఒక విశ్వవిద్యాలయంగాను త్వరలో మారబోతున్నదనికూడా డాక్టరు సంపూర్ణానంద్ ప్రకటించారు.

### కాందిశీకుల నిరసన దినం

న్యూఢిల్లీ, నవంబరు 19: ఇటీవల ఇండియా ప్రభుత్వంవారు జారీచేసిన కాందిశీక ఆస్తి ఆర్డినెన్సుపట్ల నిరసన తెలుపుతూ దేశంలో గల శరణార్థులూ, సానుభూతిపరులూ డిసెంబరు 4 నిరసనదినంగా పాటించాలని నిన్న ఇక్కడ జరిగినసభలో తీర్మానించబడింది. పురుషోత్తమదాసు టాండను అధ్యక్షతక్రింద అఖిల భారత శరణార్థి సంఘ కార్యవర్గంవారూ శరణార్థి నేతలూ, సానుభూతిపరులూ ఈ సభ జరిపారు.

సభవారు ప్రస్తుతం అమలులో ఉన్న ఆర్డినెన్సును తీవ్రంగా ఖండిస్తూ, భారతీయులంతనూ నిరసనదినంనాడు శాంతియుతంగానూ, చట్టసమ్మతంగానూ సభలు చేసి, ఆందోళన జరిపి, ఆర్డినెన్సులో సవరణలు జరగాలని తీర్మానించాలని తీర్మానించారు. ఇండియా పార్లమెంటులో ఈ మాసాంతంలో ఈ ఆర్డినెన్సు చట్టరూపం పొందక పూర్వమే దీనిలో సవరణలు జరపడం విషయమై ప్రజాభిప్రాయంలో చైతన్యం కలిగించడానికై 28 తేదీన ఢిల్లీలో బహిరంగసభ జరపాలని మరోక తీర్మానం జరిగింది.

# “కేంద్రప్రభుత్వం ఎటువంటి మితవ్యయం ఉత్తరువులు చేసినా మేము తలపెట్టిన ‘పెట్టుబడి’ కార్యాలన్నింటినీ పూర్తిచేయ నిశ్చయించాం”

## రాష్ట్రఅసెంబ్లీలో ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి హామీ

“ఆంధ్రరాష్ట్రంవస్తే ఆ రాష్ట్రప్రభుత్వానికి భవనాలుకట్టాలి, వారి స్కీములు రామపాదసాగరు, కృష్ణ - పెన్నారు ప్రాజెక్టులు అన్నీ నిర్మాణం కావాలి. వారైతేనేమి, ఈ ప్రభుత్వమైతేనేమి ఇవన్నీ ఎవరో ఒకరు పూర్తిచేయవలసిందే. కేంద్రప్రభుత్వం ఎటువంటి మితవ్యయం ఉత్తరువులు చేసినా మేము తలపెట్టిన పెట్టుబడి కార్యాలన్నింటినీ పూర్తిచేయ నిశ్చయించినాము.” అని ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు శనివారం అసెంబ్లీలో సప్లిమెంటరీ బడ్జెట్ విమర్శలకు సమాధానమిస్తూ హామీ ఇచ్చారు.

### సప్లిమెంటరీ బడ్జెటుపై రాష్ట్రఅసెంబ్లీ చర్చ

మద్రాసు, నవంబరు 19: మదరాసు అసెంబ్లీ నిన్న మధ్యాహ్నం సమావేశమైనపుడు కోరం లేకపోగా గంటమ్రోయించి సభ్యులు రప్పింపబడిరి. (ఉదయం చర్చ నిన్నటిపత్రికలో ప్రకటింపబడినది.)

శ్రీ డి. యస్. రామచంద్రరావుగారు అనుబంధ బడ్జెటులోగల సంఖ్యలనుచూస్తే అది ప్రధాన బడ్జెటుగానే తోచుచున్నదనిరి. వెనుకటి బడ్జెటులో నుండిన కొన్ని గ్రాంటుపద్దుల ప్రాధాన్యమిపుడులెగ్గి క్రొత్తపద్దులు తలయెత్తి యున్నవనిరి. క్షయ రోగుల ఆసుపత్రులలో రోగులకు వెంటనే ప్రవేశం దొరకకుండా వారలు అనేకరోజులు కాచుకొని యుండవలసి వచ్చుచున్నదనియు అలా కాచుకొనియుండి తరువాత ప్రవేశందొరికేటప్పుడు పుణ్యకాలంకాస్తా మీరిపోవడం అనుభవమై యున్నదనిరి. అందువల్ల దుర్భరమైన క్షయరోగమును ప్రారంభదశలోనే అరికట్టి నివారణ చేయుటకు ప్రభుత్వము తగుఏర్పాట్లు చేయవలెననీ కోరిరి.

అబ్దుల్ హమీద్‌ఖాన్ గారు కాంగ్రెస్ ప్రభుత్వము తమ సిద్ధాంతము ప్రకారం మద్యనిషేధ కార్యక్రమమును అమలు పరచి యుండుట మంచిదే అయిననూ నిషేధం మూలమున ప్రభుత్వము కోల్పోయిన ధనము యున్నట్టయితే అనేక ప్రజోపయోగకరమైన పనులు జరుప వీలైయుండెడిదనిరి. అదనపుడిమాండులలో బంట్రోతుల జీతాలు పెంపొందించుటకు గ్రాంటులు కోరబడి యుండుట గూర్చి సంతోషము వెలిబుచ్చిరి. ప్రస్తుతస్థితిగతుల బట్టి జీతం కనీసం రూ 75 అయియుండుట అవసరమనిరి. ప్రజలు సౌఖ్యముగా సంతోషము కలిగి యుండుటకు అనుకూలన పరిస్థితులు కలుగజేస్తే కమ్యూనిస్టుల సిద్ధాంతముగాని కమ్యూనిస్టులుగాని వ్యాప్తిచెందడం తగ్గి పోలీసుల బలగమును బలపరచవలసిన అగత్యము లేక పోవుననిరి.

శ్రీ యస్. యస్. వరదాచారిగారు ప్రభుత్వము యేయే అంశాలకు క్రొత్తగా అదనపు గ్రాంటులు కావలెనని యెంచుచున్నదో అట్టి వాటికి వ్యయమును అమోదించమని శాసనసభవారిని కోరుటకు ప్రభుత్వము ముందుకువచ్చియుండుట క్రమముగానే యున్నదనిరి. దేశములో ఉత్పత్తి ఎక్కువచేయుటకు ఉపకరించే స్కీముల వ్యయములకై మాత్రమే ప్రభుత్వం సప్లిమెంటరీ గ్రాంటులకు కోరడం సమంజసమనిరి.

మజీద్‌గారు ప్రభుత్వము ప్రజోపయోగకరమైన గొప్ప పెట్టుబడుల స్కీములను అమలుపరచకున్నారనియు వాటిని సక్రమముగా అమలుపరచగల్గితే దేశప్రజలు సుభిక్షముగానుండుటకు పరిస్థితులు ఏర్పడుననియు అపుడుసప్లిమెంటరీ బడ్జెటులో సూచించియున్నట్లు కమ్యూనిస్టు ముష్కరులను అణచుటకు పోలీసుబలము ఎక్కువ చేయవలసిన అవసరము ఉండజాలదనిరి. ఫిర్కా అభివృద్ధి కార్యక్రమము పేకమేడవలె కూలిపోవు గావింపబడుచున్నదనియు శ్రీ కామరాజ్ నాడార్ గారుకూడా ఆ స్కీము సరియైన సమార్గంలో నడపబడలేదని తెలిపినారనియు అందువల్ల ఆ స్కీమును కొంతకాలంవరకు వాయిదా వేసి కుటీర పరిశ్రమలకైనా తగువిధమున ప్రోత్సాహమియ్యవలెననియు కోరిరి.

శ్రీ కే. వరదాచారిగారు ఫిర్కా అభివృద్ధి ప్రణాళిక సవ్యముగానే సాగుచున్నదనియు శ్రీ కామరాజ్ నాడార్ గారు బహుశా పొరపాటుపడి యుండవచ్చును లేకపోతే వ్యతిరేకమైన అభిప్రాయము వెలిబుచ్చియుండవచ్చుననిరి.

రజాఖాన్‌గారు ఆంధ్ర దేశం విషయమై ప్రభుత్వము విశేషమైన ధనము సరియైన ప్రతిఫలము లేకుండా వృథాగా వ్యయపరచియున్నారని విమర్శించిరి.

కంచస్వామిగారు, కోసల్రాం గారు ప్రసంగించినపిదప శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్యగారు యీ అదనపు బడ్జెటు చాలా ఆశాజనకంగా నుండెననిరి. అసలు బడ్జెటు సమయమున సభ్యులుచేసిన విమర్శలను మన్నించినటుగ కనబడదు. సమష్టి రాష్ట్రంలో చర్చించే ఆఖరుబడ్జెటు యిదే కావచ్చు. ఇందులో సరిసమానమయిన విభాగం కనబడదు. ఇరిగేషను స్కీములలో కడపజిల్లాలో ఒక్క చెరువు మరమ్మత్తు సూచించేదు. నెల్లూరుకి లక్షలు ఖర్చుచేసే ఆరు స్కీములు సూచించేరు. కనుక రాయలసీమను అశ్రద్ధచేయుచున్నారనక తప్పదు. పరిశీలన పూర్తి అయిన ఆ ప్రాంతం స్కీము లెందుకు ప్రారంభించలేదు? ఆస్పత్రులుగూడ యీ ప్రాంతాలందు తక్కువే. తను కర్నూలు జిల్లా ఆస్పత్రిలో క్షయరోగం క్లినిక్కైనా స్థాపించలేదనిరి.

ఎం. ఏ. ఈశ్వరన్‌గారు, సుమారు 63,000, మంది బిచ్చగాండ్రు తిండిలేక బాధపడుచున్నారు. అట్టివారి కేవో సదుపాయాలు చేయాలనిరి. స్వామీ సహజానంద, జమాల్‌సాహెబ్, ఎస్. సుబ్రహ్మణ్యంగార్లు ప్రసంగించిన పిమ్మట, జే. కూర్మయ్యగారు కొండజాతులవారి సుద్దరించుట కేమి జరుగ లేదనిరి.

అన్యశాఖలు:—అదనపు బడ్జెటులో, దానిగూర్చి ఏమి లేనపుడు దానిగూర్చి ప్రసంగించరాదు.

కూర్మయ్య:—బంట్రోతులకు జీతములు పెంచుట బాగానేయుండి. ఆస్పత్రులలో పేదవారికి ప్రవేశం దొరకడం లేదు. పోలీసువారు ప్రజలకు ప్రభుత్వానికి ఎటం చేస్తున్నారుగాని చేరువ చేయడంలేదు, కనుక పోలీసు శాఖకు యెక్కువ ఖర్చుచేయరాదు. కమ్యూనిస్టు అల్లరులను ప్రచారంతోనే అణచివేయవచ్చుననిరి. భూస్వాముల సహకార స్కీముండరాదనిరి.

### మంత్రిగారి జబాబు

గా॥ బి. గోపాలరెడ్డిగారు యీచర్చకూడా పెద్దబడ్జెటు చర్చలాగే సభ్యులు పలువురు ప్రసంగించిరనిరి “సభ్యులకుఅశాభంగం కలుగుట సహజమే. 150 సం॥ల నుండి జరగని పనులన్ని యిపుడు జరగాలి కనుక యీ కొద్దిమాసాలలో ఎంత చేసినా తక్కువగా కనబడును.

“మేము ఏంచేసినా చేయకపోయినా శాంతి భద్రతలను కాపాడ కలిగితిమి. ముస్లిము అల్పసంఖ్యాకులు యితరరాష్ట్రాలలోవలె బాధలుపడకుండా రక్షించగల్గితిమి కమ్యూనిస్టులను కృష్ణ, మలబారు జిల్లాలందుగూడ అణచివేయగల్గితిమి. విద్య విషయంలో స్కూళ్లు ఎక్కువయినవి. నదుల ప్రాజెక్టులు దశాబ్దాలకాలం అశ్రద్ధ చేయబడెను. అవన్ని ఒక్కసారి పూర్తిగా నేరవు. రూ 80 కోట్లకు మించిన స్కీములకు మంజూరు చేసితిమి. 3 సం॥ లలో విద్యుచ్ఛక్తికి 9 కోట్లు ఖర్చుచేసితిమి పద్ధతి ప్రకారం అన్నిచేస్తూ, కరువురాకుండా నివారించ గల్గితిమి. ఇవి స్వల్ప విషయాలు కావు. 5 కోట్లమందికి తిండి కల్గించితిమి. ఇవన్ని రజాఖానుగారు గమనించాలి. నాకు తీరుసభ్యులుగా ఏంచేయ గల్గెరో చెప్పవలె. ప్రయివేటు బడులకు కళాశాల గ్రాంటులు యివ్వరాదని 1940 లో నిర్ణయించగా యిపుడు యివ్వదలచితిమి. ద్రవ్యాన కాశాలం తక్కువగనున్నా, ఇండియా ప్రభుత్వంవారు యిస్తానన్న ఋణం యివ్వకపోయినా, తలపెట్టినపనులన్ని కొనసాగించుటకు ద్రవ్యం సంపాదించుటకు, రిజర్వు బ్యాంకు ప్రయివేటు సంస్థల సంపర్కం చూస్తున్నాము. జనపద ఇన్సులకు పరిపోతుంది. (మద్యనిషేధం అనుసరించినా). ఆంధ్రరాష్ట్రం వస్తే వారికి భవనాలు కట్టాలి, వారిస్కీములు, రామపాదసాగరు, కృష్ణ, పెన్నారు ప్రాజెక్టులు అన్నీ కట్టవలెను. (వారైతేనేమి, యీ ప్రభుత్వముయితేనేమి, ఎవరో ఒకరు చేయవలసిందే.) ద్రవ్యం కృషి చేయాలని, కేంద్రప్రభుత్వం ఎటువంటి మితవ్యయం ఉత్తరువులు చేసినా మేము తలపెట్టిన పెట్టుబడి కార్యాలన్ని పూర్తిచేయ నిశ్చయించితిమి.

జమీందారి రద్దునకు అయేఖర్చు నిలువలోనుండి తీయం. రివెన్యూబోర్డు సభ్యులలో యిద్దరు యీ పనిమీద నున్నారు. ఇతర సాధారణ పనులన్నియు చేయుచున్నారు. కనుకనే 4 వ సభ్యుని సిబ్బందిని నియమింపవలసి వచ్చింది. జమీందారులకు నగదు 1950-51 లో యివ్వవలసియుండును. ఏ రీతిగా నగదివ్వగలమో అతిశ్రద్ధగ విచారించాలి. రిజర్వుబ్యాంకు గవర్నరుతో ఆలోచించితిని. కేంద్రప్రభుత్వానికి తెలిపేమే నిర్ణయించాలి.

ద. ఆర్కాటులో ఇగ్నైటు గనుల స్కీముగూర్చి శాస్త్రజ్ఞులు యింకా ఖచితముగు నిర్ణయములు చేయలేదు కనుక ఆలస్యమగుచున్నది.

క్షయరోగ ఆస్పత్రులను పెంచాలనియే ప్రయత్నించుచున్నాము. జిల్లాకొకటి ఉండుటకూడ అవసరమే. జిల్లాకమిటీలు ద్రవ్యం వసూలుచేసినవి రాష్ట్రీయ క్షయరోగనివారణ సంఘంవారికి ప్రభుత్వం వారు చేయవద్ద సహాయం చేయగలము. కొండజాతులవారికెట్టి సదుపాయాలు చేసితిమో బడ్జెటుచూస్తే కూర్మయ్యగారికి తెలియగలదు. డిశెంబరు 7 తే. మామునున్నాల జిల్లా ఏజంటుల సభ మదరాసులో జరుపదలచితిమి. అందు 5 సం॥ స్కీము చర్చింపబడును. ఒక ప్రత్యేకోద్యోగిని నియమింపదలచితిమి. అధికారేతరులనుగూడ ఆహ్వానించెదము.

రాయలసీమ అభివృద్ధికి స్కీములు తయారయియుండే, వాటిని నిర్లక్ష్యం చేసితిమని ని. వెంకట సుబ్బయ్యగారు నిందింపవచ్చు. కాని అట్టి దేమిలేదు.” అని మంత్రిగారనిరి.

సభ 22 వ తేదీ 11 గం. వరకు వాయిదాపడెను.

# గుర్రపు పందెముల నిషేధం

## వాయిదా వేయుటకు కాంగ్రెసు పార్టీ నిర్ణయం

మదరాసు, నవంబరు 20: గుర్రపు పందెములను నిషేధించు జూదముల చట్టము అమలు ఒక సంవత్సరము 1951 ఏప్రియలు వరకు వాయిదా వేయుటకు నిన్న జరిగిన మదరాసు శాసనసభా కాంగ్రెసు పక్ష సమావేశములో నిర్ణయించిరి.

గుర్రపు పందెముల నిషేధమును కొంతకాలమువరకు వాయిదా వేయవలెనని శ్రీ యం. భక్తవత్సలంగారు తెచ్చిన ప్రతిపాదనను పార్టీ నవంబరు 6 వ చర్చించియున్నది.

అప్పుడు. ప్రధాని శ్రీ కుమారస్వామి రాజాగారు, ఈవిషయమై ప్రధానమంత్రి, ఇండియా ప్రభుత్వమునుండి కొన్ని లేఖలు వచ్చినవనియు, ఈ లేఖల దృష్ట్యా దరిమిలా ఈ విషయం చర్చజరిగిన బాగుండునని, నిన్న సమావేశములో శ్రీ భక్తవత్సలంగారు ఆ లేఖలను వివదపరచిరి.

ప్రధానమంత్రి గుర్రపు పందెముల రద్దు విషయములో మదరాసు ప్రభుత్వమువారి అభిలాషను అభినందిస్తూ ఈ సందర్భములో గమనించదగిన వాంకేములు చేర్కొనినట్లు తెలియుచున్నది. సైనికావసరములకు వలయు వాయు సంపదకు గుర్రపు పందెముల వలన లభించుచున్న సహాయము, ఆర్థిక క్లిష్టపరిస్థితులలో ఆదాయమును కోల్పోవుట మొదలగు వానిని పరిశీలించి మీదట ప్రధాన మంత్రి ఆలోచించి వ్యవహరించవలెనని సూచించిరని తెలియుచున్నది. ఇండియాప్రభుత్వము కూడ ఇదేసరళిలో వ్రాసియున్నారట.

శ్రీ భక్తవత్సలంగారి సూచనను అంగీకరించుచూ కొంతమంది సభ్యులు గుర్రపు పందెములను సాధ్యమైనంత త్వరలో రద్దు చేయవలెననియు, ఈ లోగా ఈ వ్యసనమును తగ్గించుటకు చర్యతీసుకోవలెననీ సూచించిరి.

తరువాత “మదరాసు జూదముల చట్టము క్రింద ప్రకటన తేదీని ఒక సంవత్సరం 1951 ఏప్రిలు వరకు వాయిదా వేయుటకు ప్రభుత్వమునకు అనుజ్ఞ ఇచ్చుచూ, గుర్రపు పందెములను పూర్తిగా నిషేధించులోగా పందెములను తగ్గించుట గురించి పరిశీలించుటకు ఒక సంఘమును నియమించుటకు తీర్మానించుచున్నారు” అని శ్రీ యస్. యస్. వరదాచారిగారు ప్రతిపాదించిన తీర్మానము అంగీకరించబడెను, కమిటీని నియమించు అధికారము నాయకునికి ఇచ్చిరి.

మిగిలిన విషయములను 21 తేదీన జరుగు సమావేశమునకు వాయిదా వేసిరి.

### ఏలూరులో అగ్ని ప్రమాదం

ఏలూరు, నవంబరు 17: స్థానికొజర్వు పోలీసు లైనులో నిన్న సాయంకాలం సంభవించిన అగ్నిప్రమాద ఫలితంగా నాలుగు నివాసగృహములు తగులబడి పోయినవి. ఫైరుసర్వీసువారు సకాలములో వచ్చి మంటలార్పి వేయుటలో సహాయపడిరి. నష్టము సుమారు రూ 1500/- లుండునని అంచనా వేయబడినది. (స్వ. వి.)

## ఆంధ్ర సాముదాయిక వ్యవసాయ సంఘం

### వరదబాధితులకు సహాయం: కలెక్టరువద్దకు రాయబారం

కాకినాడ, నవంబరు 17: "ఆంధ్ర సైతు సాముదాయిక వ్యవసాయసంఘం" అనే పేరుతో ఒకసంఘము నవంబరు 11 తేదీని రిజిష్టరు చేయబడింది. దీనికి అధ్యక్షులు బాలాంత్రపు కాపుగపులు మల్లిపూడి లక్ష్మణరావుగారు, ఉపాధ్యక్షులు, ప్రధాన కార్యదర్శి భావరాజు వీరశంకరంగారు (ఆద్దింపల్లి). ఈ సంఘం ఆశయాలలో హెచ్చుపంట పండించడం, పశుగ్రాసం పెంపొందించడం, గ్రామాభివృద్ధి, రైతులలో విద్యాప్రబోధము, గృహపరిశ్రమల ప్రోత్సహించడం, వ్యవసాయ పరికరాలను కంట్రోలు ధరలకు సేకరించడం, బీదనిర్వాసిత ప్రజలకు సహాయపడడం, సహకారపద్ధతులపై సముదాయక వ్యవసాయము చేయడం మున్నగునవి కలవు.

వీరు నవంబరు 12 తేదీని జిల్లాకలెక్టరు వద్దకు రాయబారంగ్వెళ్ళి తుపానువల్ల కలిగిన నష్టవివరాలను తెలియజేసి, పల్లపు భూములలో రెండవ పంటకు సదుపాయాలు కల్పించాలని నివేదించి, గోదావరి నుంచి నీరు సరాసరి పంపుచేయు ఏర్పాట్లు గావించాలని విన్నవించి, రు. 5 లక్షలతో వరద సహాయనిధి ఏర్పరచి దానివలన నీటి వసతుల కల్పించాలని కోరిరి.

కలెక్టరుగారు శ్రద్ధగావిని, విషయము లన్నియు పరిశీలించి తగుచర్య తీసుకొనెదమని వాగ్దానం మొసగిరి. స్వ. వి.

## మార్టూరుపురం తా॥ కాం॥ వర్కర్ల సమావేశం

మార్టూరుపురం, నవంబరు 14: మార్టూరుపురం తాలూకా కాంగ్రెస్ వర్కర్ల సమావేశము 12-11-49 సాయంత్రము యీ గ్రామంలో 4 గంటలకు శ్రీ అన్నమరాజు సోమసుందరంగారి అధ్యక్షతన జరిగింది. సభకు గ్రామాలనుండి నలుబదిమందికిపైగా వర్కర్లు హాజరైరి.

అధ్యక్షుడు తాలూకా పరిస్థితులను కాంగ్రెస్ కార్యక్రమాలకు సంబంధించి నంతవరకు క్లుప్తముగ వివరించిరి. కాంగ్రెసు సంస్థయందు భక్తి విశ్వాసములు కల యీ తాలూకాలో; జిల్లాబోర్డు యెన్నికలలో ఒకఫిర్కా కాంగ్రెస్ అభ్యర్థి ఓడిపోవుటకు కారణాలు వివరించిరి.

తరువాత కాంగ్రెస్ ప్రాథమిక సభ్యులను కాంగ్రెస్ నూతన నియమావళి మేరకు చేర్పించుటలో తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులవారు తాను తన అనుచరులు తప్ప యితరులు యెవ్వరూ ఆ పనికిపూనదని, పుత్సాహముతో పనిచేయుచున్న యువజనకాంగ్రెస్ వర్కర్లకు అవరోధము కలిగించినప్పటికివాటినిలెక్కచేయక ప్రాథమికసభ్యుల చేర్పించుటకు కృషి చేసిన వర్కర్లకు అభిమానులకు యీ సభవారు కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నారనీ, మార్చి నిబంధనావళి మేరకు రానున్న గ్రామపంచాయితీ ఎన్నికలు జరుపుటకు, గత అనుభవాన్ని పురస్కరించుమని యెన్నికలు బహిరంగముగ న్యాయసమ్మతముగ జరుగునట్లు చేయుటకు, చిన్న విభేదాలతో నిమిత్తము లేకుండ నిష్పాక్షికముగ యెన్నికలు జరుగునట్లు చేయుటకు తగిన యేర్పాట్లు చేయవలసినదిగ యీ సభవారు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులవారిని కోరుచున్నారని తీర్మానములు చేయబడినవి.

## ప్రముఖుల చిత్రపటాల ఆవిష్కారం

చికాకోల్, నవంబరు 13: విశాఖపట్నంజిల్లాజడ్జి శ్రీ. వి. ఎల్. నరసింహంగారు నిన్న స్థానిక బార్ అసోసియేషన్ హాలులో మంచు వెంకటరంగనాథం పంగలు, బుర్రా శంకరశాస్త్రిగార్ల పటములను ఆవిష్కరించిరి. కిరివురు చాల కాలము ప్రముఖ న్యాయవాదులుగ, పురపాలక సంఘాధ్యక్షులుగ నుండిరి. పురాతన విశ్వనాథం, లోకా అప్పారావునాయుడు గార్లు వీరి గుణసామర్థ్యములను గురించి ప్రసంగించిరి. నరసింహంగారు యువకన్యాయవాదులు ఈ ప్రముఖులను ఆదర్శముగ నుంచ కోరవలెననిరి. జడ్జిగారికి సబ్‌కోర్టులో తేనేటివిందు జరిగెను. 300 మంది వకీళ్ళు తదితరులు పాల్గొనిరి.

జడ్జిగారు, సివిల్‌కోర్టుల, విజ్ఞాన సమితులవారి ఆహ్వానమున, ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన సభలో సంస్కృతిని గురించి ఉపన్యసించిరి. (స్వ. వి.)

### జీవనమూల్య సూచిక

మద్రాసు నగరములో కార్మికులగతి జీవనమూల్యము నవంబరు 12 తో అంతమైన వారములో 365 పాయింట్లు. మార్పు ఏమీలేదు.

## అష్టావధాని డోకూరి బాలబ్రహ్మాచార్యులు

### రాజమండ్రిలో అఖండ సన్మానం

రాజమండ్రి, నవంబరు 18: హైదరాబాదు సంస్థాన వాస్తవ్యులు, కవిరత్న, అష్టావధాని బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ డోకూరి బాలబ్రహ్మాచార్యులుగారు రాజమండ్రివచ్చి, రామకృష్ణ సేవాసమితిలో ఈ నెల 8 వ తేదీన, బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులు గారి అధ్యక్షతను అష్టావధానము చేశారు. పురజనులు వారివిద్వత్తుకు మెచ్చి 13 వ తేదీన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి అధ్యక్షతను ప్రత్యేక సభచేసి అవధాని గారికి "కవిశిరోభూషణ" బిరుదమును, రూ. 200 పారితోషికము ఇచ్చి సన్మానించారు. 14 వ తేదీన ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల మెట్రిక్ వసతిగృహ విద్యార్థులు, 15 వ తేదీన కళాశాల ఆంధ్ర సారస్వతసంఘమువారు కవిగారిచే అష్టావధానము చేయించారు. వసతిగృహం వారు శాలువలు, సారస్వతసంఘంవారు అర్థనూటపదహార్లు ఇచ్చి గౌరవించారు. కవిగారి ప్రజ్ఞను పురజనులు వేనోళ్ల కొనియాడుతున్నారు.

## శివాలయంలో చోరీ: నిందితులకు శిక్షలు

భద్రాచలం, నవంబరు 11: స్థానిక శివాలయంలో 1947 సెప్టెంబరు 4 న జరిగిన చోరీ కేసులో స్థానిక మేజిస్ట్రేటుగారు ఈ నెల 8 న తీర్పుచెప్పుచు నిందితులయిన భద్రాచలం కాపురస్తుడు, ముద్దనర్సయ్య, గుమ్మగూడెం కాపురస్తుడు జి. వీరాచారి టి. బాబురావులకు క్రిమినలు ప్రొసీజరు కోడు, 457,380 సెక్షన్లక్రింద ఒక్కొక్కరికి 6 నెలలు కఠిన శిక్ష విధించిరి. దేవాలయాలు, చర్చిలు, సత్రములు, మసీదులు మున్నగునవి ప్రతిమానవుని ఆస్తి అనీ, వాటిని కాపలా కాయుటలో ప్రతివ్యక్తి శ్రద్ధవహించవలెననీ మేజిస్ట్రేటు తీర్పులో సుడివిరి. పాపిశెని సీతారామారావుగారు 1టవ ముద్దాయి తరఫున వాదించిరి. ఈ కేసు విచారణ 2 సంవత్సరములుగ జరుగుచుండెను. 6పరు మేజిస్ట్రేటు మారిరి. చోరీ అయిన 30 తులముల బంగారము, 29తులముల వెండితో విగ్రహమును పోలీసుల పట్టుకొని యుండిరి. ఒక నెల అయిన తర్వాత దైవ విగ్రహము, నగలు దేవాలయ అమీనుకు అప్పగించెదరు, సంప్రోక్షణ అనంతరం ఆలయంలో పూజాదికములు యథాప్రకారం జరుగునని తెలిసినది. ఈ రెండేండ్లుగ ఆలయద్వారములు మూసి యుంచిరి.

2, 3 ముద్దాయిలు అప్పీలు చేయకోరినందున జామీను మీద విడుదల అయిరి. (స్వ. వి.)

## అగ్నిబాధితులకు రొక్కం, బియ్యం సహాయం

విజయనగరం, నవంబరు 14: విజయనగరం దరిగొట్లాం, గ్రామములో గత నెలయందు జరిగిన అగ్నిప్రమాదము కారణంగా నష్టపడినవారికి సహాయం చేయుటకుగాను నిన్న నిచ్చటనుండి విజయనగరం రివిన్యూ డివిజనల్ ఆఫీసర్, శ్రీ జి. రామచంద్రయ్యశెట్టి బి ఏ. గారు, శ్రీ ఎమ్. కోగారావు (విజయనగరం తాలూకా తహసిల్దార్) శ్రీ ఏ. ఏ. ఆర్. మూర్తి (విజయనగరం తాలూకా హరిజన సంఘ కార్యదర్శి) గార్లతోకలసి కారులో ఆ గ్రామానికివెళ్ళి అక్కడ అగ్ని ప్రమాదమునకు గురిఅయి నష్టపడిన 261 ఇండ్లవారికి రు.200 రూపాయలు రొక్కము పంచిపెట్టారు. ఒకొక్క గృహయజమానికి 20 రూపాయలు పోవ్వున, ఇచ్చారు, గ్రామాధికార్లును, శ్రీయుతులు తిరువూరి రామమూర్తిరాజు, తిరువూరి సత్యనారాయణరాజు, మొదలైన యింకా మరికొందరు గ్రామ పెద్దలు యందు పాల్గొన్నారు.

గ్రామపెద్ద శ్రీ. తిరువూరి రామమూర్తి రాజుగారు 100 అగ్ని బాధితుల కుటుంబాలకు బియ్యం పంచిపెట్టారు. ముఖ్యంగా యీ గ్రామ అగ్నిబాధితుల విషయంలో అమిత శ్రద్ధబూని ప్రభుత్వంవారినుండి అతి జరూరు సహాయము చేయించి తోడ్పడిన విజయనగరం రివిన్యూ డివిజనల్ ఆఫీసరు, శ్రీ రామచంద్రయ్య శెట్టిగారికి గ్రామపెద్దలు, ప్రజలు కృతజ్ఞత తెల్పారు.

### నిడుబ్రోలులో మద్యనిషేధపు అరెస్టులు

[illegible] 8 డ్రాముల కొత్తసారాయి, సారాయి కాచుటకుపయోగించు వస్తువులు, [illegible] బంగారుకడ్డి, సారాయికోసం పరికరములన్నీ పట్టుకొని, వారిద్దరిని అరెస్టు గావించారు.

## ఏటుకూరి వెంకట నరసయ్యగారి స్మారక దినోత్సవం

### నవంబరు 24 వ తేదీ నిడుబ్రోలులో జరుగుతుంది

కవిబ్రహ్మ సన్మానసంఘ ప్రధాన కార్యదర్శి అవుల గోపాలకృష్ణమూర్తి గారు యీ క్రింది ప్రకటన చేశారు.

"కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్యగారికి గుంటూరులో అఖండసన్మానం చేయుటకు నిర్ణయమైన విషయమున్నూ, దానికై విరివిగా యేర్పాట్లు జరుపబడుచున్నట్లున్నూ, యిప్పటికే 230 పేజీలు సన్మానసంచిక అచ్చుగూడా పూర్తి అయినదని, ఆంధ్రదేశంలో విశేషభాగం యెరిగే వుంటుంది."

"ఆ పరిస్థితుల్లో కవిబ్రహ్మ అక్టోబరు 25 వ తేదీనుండి జ్వరమువల్ల కీళ్ళనొప్పులవల్ల బాధపడుచు యీ నెల 10 వ తేదీ రాత్రి 11 గంటలకు కాలధర్మము నొందటం, వారి కుటుంబానికే గాక, ఆంధ్రప్రజలకు, ముఖ్యంగా ఆహ్వాన సంఘంవారికి చెప్ప వలవిగాని దుఃఖ పరిస్థితుల్ని కల్పించింది.

ఆచార్య రంగా మొదలైనవారి అధ్వర్యాన కవిబ్రహ్మ స్మారకసంఘం ఒకటి స్థాపింపబడింది.

ఈ నెల 24 వ తేదీ గురువారం నిడుబ్రోలులో "కవిబ్రహ్మ స్మారకసభ" సాయంత్రం 5 గంటలకు జరుగును. ఆంధ్ర వాఙ్మయబ్రహ్మ శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు అధ్యక్షత వహించెదరు. ఆరోజు సభలో వివిధజిల్లాల ప్రముఖులు పాల్గొందురు. కాబట్టి కవిబ్రహ్మమిత్రులు వారి కర్తవ్యంపట్ల ఆదరాభిమానము కలవారు, కవితాప్రియులు, కళోపాసకులు, ఆరోజు నిడుబ్రోలువచ్చి ఆ సభలో పాల్గొనవలెనని సన్మాన సంఘం తరఫున, స్మారక సంఘం తరఫున విజ్ఞప్తి చేయుచున్నారు.

కవిబ్రహ్మ కుటుంబ సహాయార్థమున్నూ వారి సాహిత్య ప్రచారమునకున్నూ సహాయంగా తమకు తోచిన విరాళములను శ్రీ పాములపాటి బుచ్చినాయుడుగారు, నిడుబ్రోలునకు పంపప్రార్థన.

## అముద్రిత రచనల ముద్రణకు ఏర్పాట్లు

### రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి విజ్ఞప్తి

విజయవాడ, నవంబరు 18: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం తరఫున కీ॥ శే॥ ఏటుకూరి వెంకట నరసయ్యగారి అకాలమరణమునకు ప్రధాన కార్యదర్శి కండుల ఓబులరెడ్డిగారు తమ సంతాపాన్ని తెలుపుతూ, కవిబ్రహ్మ రచనల్లో ఇంకా అముద్రితములుగావున్న వాటికి ఆంధ్రపాఠకలోకానికి అందించవలసినబాధ్యత, వారి నిరుపేద కుటుంబ సహాయబాధ్యత ఆంధ్రులపైన వున్నదని విజ్ఞప్తి చేస్తున్నారు.

చేబ్రోలు హైస్కూలులో వాసిలి నరసింహారావుగారి అధ్యక్షతక్రింద ఉపాధ్యాయ, విద్యార్థి బృందము సభజరిపి కవిగారిమృతికి సంతాపం వెల్లడించారు.

ఈ నెల 11 వ తేదీన కొల్లూరుబోర్డు హైస్కూలులో ఉపాధ్యాయ బృందం వారు పులిపాక వెంకటకృష్ణయ్యగారి అధ్యక్షతక్రింద సంతాపసభ జరిపారు. నిడుబ్రోలులో పత్రికా రచయితలు, చేనేత పత్రికా కార్యాలయములో సమావేశమై సంతాపం వెల్లడించారు.

గుంటూరు మండల గ్రంథాలయసంఘ కార్యదర్శి కొండయ్యగారు, కర్నూలు నుండి లలిత కళాపరిషత్తు తరఫున కార్యదర్శి పి. జి. సత్యనారాయణరావుగారు తమ సంతాపం తెలియజేస్తున్నారు.

### గుంటూరుజిల్లా కిసాన్ కాంగ్రెస్ కార్యదర్శి సంతాపం

వాసెపూడి, నవంబరు 14: గుంటూరు జిల్లా కిసాన్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి బరిగల్ల సత్యనారాయణ గారిల్లా వ్రాస్తున్నారు.

ఏటుకూరి వెంకటనరసయ్యగారు సామాన్య రైతుకుటుంబములో జన్మించి, మాతృభాష, సంస్కృతములను అభ్యసించి ఉభయ భాషా ప్రవీణులైనారు. తమ జీవితమును సౌఖ్యముగా గడుపుటకును, జిల్లాబోర్డు హైస్కూళ్లలో పండితులుగా పనిచేయుచూ, కవిత్వమును, పెంపొందించుకొని, ఆంధ్రదేశములో పేరుగాంచుటయే గాక, కవిబ్రహ్మయని బిరుదమును పొందినారు. వీరు రచించిన గ్రంథములను జూచినచో, వీరు రైతుకవియని యిట్టే తెలియుచున్నది. ఇట్టివారి అకాల మరణవార్తను ది 12-11-49 న పత్రికల ద్వారా తెలుసుకొని నిర్ఘాంతపోయినాను. కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనరసయ్యగారి అకాలమరణమునకు జిల్లా రైతాంగము తరఫున నేను విచారమును వెలిబుచ్చుచూ, వారి కుటుంబమునకు యింతమూలముగా నా సానుభూతి తెలియజేయుచున్నాను.

## ఇతరులు చెప్పే దేమిటో కాస్త వినాలి

### పరిషత్ సభ్యులకు రాజేన్‌బాబు హితవు

న్యూఢిల్లీ, నవంబరు 18: తాను ప్రసంగించటానికి చూడటమే కాకుండా ఇతరులు గప్పే దేమిటో కాస్త వినాలి. అని రాజ్యాంగపరిషత్ అధ్యక్షులు బాబూరాజేంద్రప్రసాద్ ఈ వేళ సభ్యులకు ఒక హెచ్చరిక చేశారు.

నేనెప్పుడూ వినటమేతప్ప మాట్లాడే సావకాశం లేదు. సభ్యులు కనీసం నాపట్లనైనా సానుభూతి వహించాలి.

పరిషత్ సమావేశం జరుగుతున్నప్పుడు హాల్లో సభ్యులు చాలా తక్కువమంది ఉంటున్న కారణంగా అధ్యక్షులు ఇలా అనవలసి వచ్చింది.

## ఓషధీ సంఘం సిఫార్సులు

న్యూఢిల్లీ, నవంబరు 18: జాతీయ ఓషధులను పెంచే కార్యక్రమాన్ని అభివృద్ధి చేయాలని, ప్రభుత్వ ఓషధీసంఘం వారు కొన్ని సిఫారసులు చేశారు.

20 జాతీయ ఓషధీ వృక్షాలను ఎత్తి వారు ఒక జాబితా తయారుచేశారు. వాటి పెంపకానికి యీదిగువ ప్రదేశాలను సిఫారసుచేశారు. నీలాపర్వతాలు, సుగ్రాపూర్, మనాలీ, కోయంబత్తూర్, నీలగిరి, పూనా, పంచగని, డార్జిలింగ్ జొవై షిల్లాంగ్.

ఈ ఓషధులనుంచి తయారుచేయబడిన వస్తువులను పరీక్షించటానికి సరియైనయేర్పాట్లు చేయాలనికూడా సూచించారు.

## వడ్డే కార్మికుల మహాసభ

ఉరవకొండ, నవంబరు 16: అనంతపురంజిల్లా, ఉరవకొండ తాలూకా వడ్డే కార్మికుల మహాసభ ఉప్పర ఉరుకుందప్ప గారి, (గాంధీ హరిజన హాస్టల్ అధ్యక్షుడు) అధిపత్యమున వైభవముగా జరిగింది. ఈ మహాసభకు సుమారు, 600 మంది వడ్డే కార్మికులు వచ్చియుండిరి. శ్రీ ఎ. నారాయణప్పగారు (అధ్యక్షుడు, రాష్ట్ర వడ్డే కార్మిక సంఘం) సభను ప్రారంభించిరి. శ్రీ బి. గంగరాజుగారు, ధ్వజారోహణ మొనర్చిరి.

శ్రీ నేమకల్లు రామన్నగారు స్వాగతోపన్యాసము గావించిరి. పలువురు మాట్లాడిన తదనంతరము,—

ఈ సంఘమువారు వెనుకబడిన జాతులలో చాలా వెనుకబడినవారుగాన నిమ్న జాతుల తరగతిలో చేర్చి వారికి సౌకర్యములు కలిగించవలయుననియూ ఈ కార్మికులు, పరస్థలములలో పనిచేసి జీవించుచు విద్య బొత్తిగా లేనివారు గాన కనీసము, 20 సం॥రకు ప్రారంభ తరగతి మొదలు, ఉన్నత కళాశాలలవరకు, తమ బాలబాలికలకు జీతములు లేకుండా వుచిత విద్య చెప్పించవలయుననియు,—ఎవ్వరు కంట్రాక్టు చేసినను, పనిచేయువారు తామే గావున, సర్కారు కంట్రాక్టు పనులు యావత్తు-పనులు యివ్వకుండా తమ సంఘమువారికే యివ్వవలయుననియూ— తుంగభద్రనగ్రరా ప్రాజెక్టులవద్ద పనిచేయు, తమ సంఘమువారికి కూలీ హెచ్చించి, తమ వసతులు కలిగించవలెననియు, ప్రభుత్వమును కోరుతూ తీర్మానాలు చేశారు.

వి. నారాయణగారి వందనములతో సభ ముగిసినది.

## మద్రాసు ఎస్. ఎస్. ఎల్. సి

కలకత్తా, నవంబరు 19: మద్రాసు ఎస్.ఎస్.ఎల్.సి పరీక్షలో ఎలిజిబిలిటీ సంపాదించినవారిని కలకత్తా విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషనులో ఉత్తీర్ణులైన వారితో సమముగా భావించి, వారికి పశ్చిమ బెంగాలులో ఉద్యోగావకాశముల కలిగించ పశ్చిమ బెంగాలు ప్రభుత్వంవారు నిర్ణయించిరి.

### సంతాపసందేశాలు

కవిబ్రహ్మ నరసయ్య గారి మృతికి, పాముర్రునుంచి కోగంటి దుర్గామల్లికార్జునరావు, బెల్లూరునుండి జాషువర్మ వీరరాఘవకవి, అమృతలూరు నుండి మిక్కిలినేని భగవంతరావు గార్లు తమ గాఢ సంతాపాన్ని వెల్లడిస్తున్నారు.

గుంటూరులో ఆంధ్ర నాట్య సాహిత్య సమితివారు శ్రీ జమ్ములమడక మాధవరాయశర్మ గారి అధ్యక్షతను ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో సభ చేసి కవిగారి మృతికి తమ దుఃఖాన్ని తెలుపుతూ తీర్మానం చేశారు.

"కవిగారు ఎక్కువకాలం జీవించి విలువైన కవిత్వాన్ని ప్రసాదించలేకనే భాగ్యం వారి కబ్బకపోవడం గాయక లోకానికి లభించకపోవడం దురదృష్టం. యీ నెలలో జరుగబోతున్న సన్మానాన్ని చూచి ఆనందించకుండా స్వర్గస్థులు కావడం మిక్కిలి శోచనీయం. కవిబ్రహ్మ ఆత్మకు శాంతి కలుగజేయుగాక అని భగవంతుని నిష్కల్మష భక్తితో ప్రార్థించుచున్నాము." అని ఆంధ్ర గాయకలోకం తరఫున అప్పికట్లనుండి బాల భాస్కరశాస్త్రి ఇదలంటి రామమూర్తిగారు సానుభూతి తెల్పుచున్నారు.

## కదిరి తాలూకా రా. బా. సమావేశం

### మంజూరుచేసిన భూముల తగాదాలను పరిష్కరించమని తీర్మానం

కదిరి, నవంబరు 17: కదిరితాలూకా రాజకీయబాధితుల సమావేశము 16-11-49 తేదీన జిల్లా కాంగ్రెసు కార్యదర్శి హెచ్. నరసింగరావుగారి అధ్యక్షతన జరుపబడెను.

భూములు యింకనూ మంజూరుకాని రాజకీయ బాధితుల విషయము శ్రద్ధతో, త్వరగా విచారించి, భూములను మంజూరు చేయవలెననియూ, భూములు మంజూరు కాబడినవారి విషయములో వున్న తకరార్లు త్వరలో విచారించి, పరిష్కరించి, "డి" ఫారములు ఇస్తూ మంజూరుచేసిన భూమిని రాజకీయ బాధితుని స్వాధీనము చేయవలెనని, శ్రీ జిల్లా కలెక్టరుగారిని కోరుతూ ఈ సభవారు తీర్మానించారు.

రాజకీయ బాధితులకు ఇదివరకు పట్టాకు ఇచ్చిన భూములలోగల చెట్లు, రాళ్ళ క్రయమును, రాజకీయబాధితులనుండి ఎంత మాత్రమూ వసూలు చేయకూడదని రాష్ట్ర ప్రభుత్వమువారిని సభవారు కోరారు.

ఈ సంఘమునకు అధ్యక్షుడు ఎ. వి. రమణప్ప కార్యదర్శిగా ఎస్. రామమూర్తి, ఉపాధ్యక్షుడుగా, ఎ. పి. వెంకటరెడ్డిగార్లను ఏకగ్రీవముగా యెన్నుకొన్నారు.

## నంద్యాలకు ఆంగ్లికన్ క్రైస్తవ మతగురువురాక

నంద్యాల నవంబరు 12: ఇండియా, బర్మా, సింహళము నందలి ఆంగ్లికన్ క్రైస్తవుల మతగురువు (మెట్రోపాలిటన్) రెవరెండు జార్జిహబ్బర్ట్ కలకత్తా నుండి గురువారం మధ్యాహ్నము యిచటికేతెంచిరి. రైలు దిగినవెంటనే వారిని పుష్పమాలాలంకృతులజేసి అలంకరింపబడిన వాహనమున నాసీనులగావించి, యస్. పి. జి. మిషన్‌కాంపౌండు చేర పుత్సవము గావించిరి.

బద్దు రీడింగురూమునందు నాటిసాయంత్రము ఒక బహిరంగసభ జరిపి, మెట్రోపాలిటన్‌గారికి ఒక సన్మానపత్రము సమర్పించి గౌరవించిరి. మెట్రోపాలిటన్ గారు స్వాగతమునకు కృతజ్ఞతచెప్పి, యేసుక్రీస్తు ప్రవక్త ఆదర్శ ఉపదేశములను యెల్లరు పాటింప జనవలెనియు, తమ యిరుగుపొరుగువారినే గాక, తమ శత్రువులనుగూడా ప్రేమించవలెనని విజ్ఞప్తిజేసిరి. 'జనగణ' గీతమును పాడిన తరువాత సమావేశము ముగిసెను.

ఈ నెలాఖరు వరకును యీ ప్రాంతమున మెట్రోపాలిటన్‌గారు సంచారము మొనర్చెదరని తెలియుచున్నది. (స్వ. వి.)

## వెంకటగిరిలో చక్కెర పంపకము

వెంకటగిరి, నవంబరు 18: వెంకటగిరికి 30 బస్తాలు చక్కెరవచ్చినది. అందులో 18 రేషన్‌షాపులకు 16 3/4 బస్తాలు యిచ్చినారు. గ్రామాలకు 3-3/4 బస్తాలు యిచ్చినారు. 5 హోటళ్ళకు ఒక బస్తా యిచ్చినారు. తతిమా 8 1/2. బస్తాలు స్పెషల్ పర్మిట్లనిమిత్త యిచ్చినట్లు తెలియుచున్నది. రేషన్‌షాపులకు యిచ్చిన కోటాలో కార్డుకు పదిపలములవంతున యివ్వనున్నారు కానీ షాపు 1 కి ఎన్ని కార్డులు వున్నవో అన్ని కార్డులకు సరిపోవులాగు యివ్వలేదు. వెంకటగిరి రాజాగారి స్టోరులలోని మొత్తము బస్తాలలో 28 పీకలు తరుగు చూపెట్టనారట. స్పెషల్ పర్మిట్ల విధానములో స్థానిక డిప్యూటీ తహశీల్‌దారు ఒకపద్ధతిమీద పోలేదనిన్నీ, పాక్షికదృష్టితో ప్రవర్తించినారనిన్నీ, పట్టణకాంగ్రెసు అధ్యక్షుడు అంటున్నారు. ప్రజలలో గూడా ఆలజడిగావుంది. పురజనులు జిల్లాకలెక్టర్‌గారికి ఒక మహజరుపంపుతూ చక్కెర పంపకము సరిఅయిన పద్ధతులమీద అనగా అందరికి పంపకము జరిగేటట్లు స్థానికాధికారులకు ఉత్తర్వులు పంపవలసినదిగా కోరిరి. (స్వ. వి.)

## చీరాలలో పంచదార గిరాకి

చీరాల, నవంబరు 17: ఈ పూర్తిలో పంచదారకు బ్లాకుమార్కెట్టులో దినదినము ధర పెరుగుచున్నది. లోగడ వీశ 1 కి రు 3-8-0 వున్నదని తెలిసింది. కాని ఈ రోజు రేటు వీశ 1 కి రు 4-8-0 ను 5-0-0 లు కూడా వున్నది. కంట్రోలు రేటుకు పంచదార దొరకదు. పంచదార కంట్రోలుచేయుట అన్నటకు అధికారులు ఏమీ ఏర్పాటుచేయలేరు. మధ్యతరకం వారంతా పంచదార మానివేసి బెల్లం, కలకండ వాడివాడుచున్నారు. అందువల్ల వాటిధరలుకూడా పెరుగుచున్నవి. మొత్తం మీద జీవితవ్యయం విపరీతంగా రోజురోజుకు పెరుగుచున్నది. (స్వ. వి.)

# త్వరలో హైదరాబాద్ హాలీశిఖా నాణెముల రద్దు

## సంస్థాన ఆర్థిక విలీనీకరణతో జరుగగలదని చౌధరీ వివరణ

హైదరాబాదు, నవంబరు 19: భారత సమాఖ్యలో హైదరాబాద్‌ను చేర్చే కార్యక్రమం పూర్తి అనంతరమున సంస్థాన రాజకీయ ప్రతిపత్తిలో మార్పేమీ ఉండదని నేడు విలేఖరుల సభలో మేజర్ జనరల్ చౌధరీగారన్నారు. సంస్థానాన్ని భారత సమాఖ్యలో చేర్చే విషయంలో యిప్పుడేదైనా నిర్ణయం చేసినట్లయితే దానిని సంస్థాన రాజ్యాంగ పరిషత్తు ధృవపరచ గలదన్నారు. హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు 1950 మార్చి 8న జరుపుటకు నిర్ణయం చేయబడినదన్నారు. హైదరాబాద్‌లో మత సంబంధమైన ప్రమాదం గాని, కమ్యూనిస్టు ఉపద్రవంగాని తిరిగి తలఎత్తే అవకాశం ఉండదని నేననుకొనన్నారు. మొట్టమొదటిసారి ఆయన హైదరాబాద్ వచ్చినప్పుడు కమ్యూనిస్టు ఉపద్రవం అధికంగా ఉంది. ఆ పరిస్థితి క్రమక్రమంగా చక్కచేయబడింది. ఈ సంవత్సరం సెప్టెంబరు 22, అక్టోబరు 22 యీ ప్రమాదం కొంచెం తలఎత్తింది కాని, యిప్పుడు పరిస్థితి పూర్తిగా అదుపులో ఉన్నది. అని ఆయన అన్నారు.

ప్రస్తుతం నిర్బంధంలోనున్న కొంతమంది రజాకార్లను విడుదలచేసే విషయం ఆలోచనలో ఉన్నదనీ, యీ విషయమై త్వరలోనే ఒక ప్రకటన చేయబడగలదనీ అన్నారు. ఈ విషయంలో, ఇటీవల హైదరాబాద్ వచ్చిన అఖిలభారత జమైత్ ఉల్ ఉలేమా కార్యదర్శి మౌలానా హాఫిజ్‌జూర్ రహమాన్‌కు ఏమైనా హామీ యివ్వబడినదా అని అడుగగా, లేదన్నారు. ఇటువంటి హామీని ఎవరికైనా యివ్వటం కుదరదన్నారు.

ప్రస్తుతం 'ఇంటి అరెస్టు'లో నున్న లాయక్‌అలీ మంత్రివర్గసభ్యుల పరిస్థితిలో మార్పేమీ ఉండబోదన్నారు.

హైదరాబాద్ మాజీ ఆర్థిక మంత్రి నవాబ్ మొయిన్‌నవాజ్ జంగ్‌పై పెట్టబడిన కేసు విషయంలో భారతప్రభుత్వం వ్యవహరిస్తున్నదనీ, యీ కేసు బ్రిటిషు హైకోర్టులో విచారణకు రాగలదనీ చౌధరీగారన్నారు. ఈ విషయంలో హైదరాబాద్ నుండి పాతులు వెళ్ళవలసిన అవసరం లేదనుకుంటానన్నారు. హైదరాబాద్ అడ్మినిస్ట్రేటివు సర్వీసు, ఇండియా అడ్మినిస్ట్రేటివు సర్వీసులో యింకా కలిపివేయబడలేదన్నారు. ఇది చర్చలో ఉన్నదన్నారు. హైదరాబాద్ సైన్యం 10 వేలకు తగ్గించబడిందనీ వచ్చే సంవత్సరం 7 వేలకు తగ్గించబడగలదనీ అన్నారు. గత ప్రపంచయుద్ధానికి పూర్వం హైదరాబాద్ సైనికబలం ఇంతే ఉండేదన్నారు. కొద్దికాలంలో హైదరాబాద్ ఆర్థికవ్యవస్థలో కొంతభాగాన్ని భారత ఆర్థికవ్యవస్థలో చేర్చటం కాగలదని, హాలీశిఖా రూపాయికి బదులు ఇండియా రూపాయి చలామణిలోకి రాగలదనీ అన్నారు.

## రాజాజీకి "సాహిత్య కోవిద" బిరుదు

### మైసూరు విశ్వవిద్యాలయం వారి నిశ్చయం

విశాఖపట్నం, నవంబర్ 19: భారత గవర్నరు జనరల్ శ్రీ రాజగోపాలాచారి గారికి మైసూరు విశ్వ విద్యాలయం డిసెంబరు 19 న ప్రత్యేక స్నాతకోత్సవం జరిపి సాహిత్య కోవిద (డి. లిట్.) గౌరవ బిరుదును ప్రసాదిస్తారని తెలుస్తున్నది. ఈ సంగతిని మైసూరు వారు రాజాజీకి తెలియ జేశారు. ఇప్పుడు ఆయన అంగీకారం కొరకు ఎదురు చూస్తున్నారు.

రాజగోపాలాచారి గారు ప్రత్యేక విమానంలో డిసెంబరు 15 న ఇక్కడకు వచ్చి 17 వ తేదీన మద్రాసు వెళతారు. అక్కడ నుండి 19 న మైసూరు వెళతారు. ఇదీ వారి తాత్కాలిక కార్యక్రమంగా భావింపబడు తున్నది.

ఇక్కడ వుండే స్వల్ప కాలంలో రాజాజీకి నిర్విరామ కార్యక్రమం ఏర్పాటైనది. మహిళా క్షేమ సంఘం, వారిని కలుసుకొంటారు. సర్కార్ స్నానకను, ఆంధ్ర విశ్వవిద్యాలయమును, సింధియా నౌకా నిర్మాణశాలను దర్శిస్తారు. స్థానిక న్యాయవాదులను కలుసుకొంటారు.

డిసెంబరు పదవ తేదీన మద్రాసు గవర్నరు భావనగర్ మహారాజా ఇక్కడ స్నాతకోత్సవంలో పాల్గొని, మళ్ళీ రాజాజీకి స్వాగతమిచ్చేందుకు 15 న వస్తారు. డిసెంబరు 10 న తేదీన భావనగర్ మహారాజా "అబ్దుల్ కలాం అజాద్ ఫార్మస్యూటికల్ లేబరేటరీస్" కు శంకుస్థాపన చేస్తారు. వారి పతీమణి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో "వస్త్రపూర్తి మందిరము" నకు శంకుస్థాపన చేస్తారు.

### ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కళాశాల ప్రిన్సిపాలు

ఆంధ్ర విశ్వవిద్యాలయ సిండికేట్ శేటి ఉదయం సమావేశమై యూనివర్సిటీ కాలేజి ప్రిన్సిపాలుగా కె. రంగధామ రావుగారిని నియమించారు.

గుంటూరులో ఎ. సి. కాలేజీకి అనుబంధంగా ఒకటి, విజయనగరంలో మహారాజా కళాశాలకు అనుబంధంగా ఒకటి, ఉపాధ్యాయుల ట్రెయినింగు కాలేజీలను రెంటిని వచ్చేఏడునుండీ స్థాపించవలెనని మద్రాసు ప్రభుత్వం నిశ్చయించినట్లు, వీటిని నడిపించవలసిందిగా ఆంధ్రవిశ్వవిద్యాలయమును అడిగినట్లు తెలుస్తున్నది. ఈ విషయమై ఆలోచించుటకు ఒక సంఘమును సిండికేటువారు నేడు నియమించారు. వచ్చేఏడునుండీ గుంటూరుజిల్లా నరసరావుపేటలో సెకండ్ గ్రేడ్ కళాశాలను స్థాపించే విషయము ఆలోచించుటకు మరొక సంఘముకూడా నియమితమైనది.

గణితశాస్త్రాధ్యాపక వేంకటి విజయరాఘవాచార్యులు గారు కన్నెకుడిలో అలగప్పచెట్టియార్ చే స్థాపితం కాబోయే టెక్నాలజికల్ కాలేజీలో చేరే ఉద్దేశ్యంతో ఇక్కడ రాజీనామానిచ్చారు. (స్వ. వి)

### ఏలూరు కాలవ మరమ్మత్తు పూర్తి

విజయవాడ నవంబరు 19: మరమ్మత్తుల వలన గత 10 రోజులనుంచీ మూసి వేయబడియున్న ఏలూరు కాలవ నేటి ఉదయం తిరిగి తెరువ బడింది. కాలువ యిప్పుడు పడవలరాక పోకలకు వ్యవసాయ నీటి పారుదలకు సిద్ధముగా నున్నది. సూపరింటెండింగు ఇంజనీరు జి. ఎ. నరసింహారావు గారు యీ విషయాన్ని తెలియజేస్తూ, కాలువను మూసి వేసిన కాలంలో పైర్లకు ఏమీయిబ్బంది కలిగి ఉండదనిన్నీ ఎందుచేత నవగా, నీటి సరఫరా కావలెనని రైతుల నుండి లేనట్టు అర్జీలు రాలేదని అన్నారు. కృష్ణాజిల్లా కలెక్టరు పంట కాలువలకు యింత త్వరగా మరమ్మత్తును చేయించినందుకు నరసింహారావు గారిని అభినందించారు.

గత నెలలో తుఫానువల్ల, వరదలవల్ల దెబ్బతిన్న కృష్ణా జిల్లాలోని చెరువులన్నీ ఏలూరు కాలవ మినహాగా, యీ నెల 18 వ తారీకునుంచి ఉపయోగానికి తీసుకొనిరాబడినవి. విజయవాడ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు కాలోని 13 పి. డబ్ల్యు. డి. చెరువులలోను 12 చెరువులు 15 వ తేదీకల్లా మరమ్మత్తు చేయబడినవి. కృష్ణా జిల్లాలో జమీందారీలలోని మొత్తం 78 పెద్ద చెరువులలోను 44, చిన్న చెరువులు మొత్తం 618 లో 282 వరదలవల్ల బాగా దెబ్బతిన్నవి. వీటిని యింకా బాగుచేయ్యవలసి యున్నది. పై 44 చెరువులను మరమ్మత్తు చెయ్యటానికి 12 మంది సూపర్‌వైజర్లు నియమింపబడినారని తెలుస్తున్నది.

## ఆహార స్వయంసమృద్ధి: ప్రజల సహకారం

### హైద్రాబాదులో ఆర్. కె. పాటిల్ ఉద్బోధ

హైద్రాబాద్, నవంబరు 18: ప్రజలు తిరిగి గ్రామాలకు వెళ్ళి, వ్యవసాయంపై దృష్టిని కేంద్రీకరించి, ఆహారధాన్యాల ఉత్పత్తిని అధికం చెయ్యవలసిందని భారత ప్రభుత్వ ఆహారశాఖ కమిషనరు ఆర్. కె. పాటిల్ గారు నేడు నారాయణగూడాలో వై. ఎం. సి. ఎ. వద్ద స్వామి రామానందతీర్థ గారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తూ విజ్ఞప్తిచేశారు. గత 20 సంవత్సరాలనుండి ప్రజలు గ్రామాలను వదలి పట్టణములకు, నగరములకు వస్తున్నారనీ, దీనివల్ల వ్యవసాయం క్షీణించిపోతున్నదనీ, 10 సంవత్సరాల కాలంలో కోటి యకరాల భూమి, చవుడెత్తిపోయిందనీ పాటిల్ గారన్నారు. ఈభూమినంతను తిరిగి సాగుకిందికి తీసుకొనిరావలసిన బాధ్యత వారిమీద ఉన్నదని అన్నారు. దేశంలో అనేకమంది ప్రజలు, ముఖ్యంగా స్వాతంత్ర్యం వచ్చినతర్వాత ప్రతిపనినీ ప్రభుత్వమే చెయ్యాలనీ, దేశంలో ఏది జరిగినప్పటికీ ప్రభుత్వానిదే బాధ్యతనీ భావించుచున్నారన్నారు. ఇది నిజమైన ప్రజాస్వామికానికి దోహదమివ్వదనీ, నియంతృత్వానికి దారి తీయగలదనీ అన్నారు. "దేశంలో దరిద్రాన్ని రూపుమాపటానికి, ప్రజలకష్టాలను తొలగించి జీవితాన్ని సౌఖ్యవంతం చేయ్యటానికి ప్రభుత్వం కంకణం కట్టుకొన్నది. అయితే ప్రజలు ముందుకు వచ్చి ప్రభుత్వంతో అన్నివిధాలా సహకారం చూపకపోతే యీ మహా కార్యభారాన్ని కొనసాగించటం కష్టంకాగలదనీ, దీనిని జయప్రదంగా కొనసాగించటానికి ప్రజలసహకారం ఎంతో అవసరమనీ అన్నారు. విద్యావంతులు గ్రామాల్లో పర్యటించి గ్రామస్థులకు ప్రభుత్వ కార్యక్రమాన్ని ప్రణాళికలను వివరించి తెలియజేయాలన్నారు. ఆహారధాన్యాల కొరతనింకా ఉండటం వల్లనే అధికంగా ఆహారధాన్యాలను పండించవలసిన అవసరం కలుగుతున్నదని అన్నారు. ప్రజలు, ప్రజాస్వామిక సూత్రాలను అర్థంచేసుకుని నడచినప్పుడే ఇండియాలో ప్రజాస్వామికం జయప్రదం కాగలదన్నారు.

పాటిల్‌గారు నేటి ఉదయం బెంగుళూరునుండి యిక్కడకు వచ్చారు. బేగంపేట విమానాశ్రయంవద్ద వారికి సంస్థాన గ్రామపునర్నిర్మాణశాఖా మంత్రి నవాబ్ జైన్‌యార్‌జంగ్, వ్యవసాయమంత్రి బి. హెచ్. కృష్ణరావు, రెవిన్యూమంత్రి ఎం. శేషాద్రి, మొదలగు అధికార్లు స్వాగతమిచ్చారు. స్వామీ రామానందతీర్థ డా॥ జి. ఎస్. మేల్కోటే గార్లు కూడ అక్కడ హాజరై ఉన్నారు.

పాటిల్ గారు వచ్చిన అనంతరం, జరిగిన సప్లయి, వ్యవసాయ అధికారులతో ప్రణాళికలు, యీ విషయంలో ఎంత వరకూ పని జరిగిందీ, మైనరు ఇరిగేషన్ ప్రాజెక్టులు మొదలగు విషయాలనుగురించి చర్చ జరిగింది. ఈ చర్చ దాదాపు రెండున్నరగంటలసేపు జరిగింది. యీ సమావేశానికి ఆర్. కె. పాటిల్ అధ్యక్షతవహించారు. గ్రామపునర్నిర్మాణశాఖ పబ్లిక్ వర్క్సు మంత్రులు, రెవిన్యూ పబ్లిక్ వర్క్సు, ఆర్థికం, సప్లయి శాఖల కార్యదర్శులు, గ్రామపునర్నిర్మాణశాఖ డైరెక్టర్ కార్యదర్శి, సహకార సంస్థల రిజిస్ట్రారు, చీఫ్ మార్కెటింగు ఆఫీసరు ఇరిగేషన్ చీఫ్ ఇంజనీరు మొదలగు అధికార్లు దీనికి హాజరయ్యారు.

ఆహార అధికోత్పత్తి విషయంలో హైదరాబాద్ ప్రణాళికలనుగురించి అధికార్లు పాటిల్ గారికి తెలియజేశారని తెలుస్తున్నది. తెగిపోయిన చెరువుకట్టలకు మరమ్మత్తు చేయించవలెననీ, మైనరు ఇరిగేషన్ ప్రాజెక్టులను అమలులోకి తీసుకొని రావలసిందనీ, పాటిల్ గారు వక్కాణించినట్లు తెలుస్తున్నది.

తర్వాత పాటిల్ గారు శివరాంపల్లెలో ఉన్న గ్రామసేవా కేంద్రాన్ని దర్శించారు. అక్కడ రామకృష్ణరావు ప్రభృతులు గారు వారికి కేంద్రంలోని వివిధభాగాలను చూపించారు.

## పాకిస్తాన్ బ్యాంకులతో లావాదేవీలు

### ఇండియాప్రభుత్వ ఆర్థిక కార్యక్రమము

ఢిల్లీ, నవంబరు 18: పాకిస్తానులోని బ్యాంకు లేవైనను తమకుగల ద్రవ్యావకాశములనుబట్టి ఇండియా రూపాయిలను కొనుక్కొని నిల్వచేసికొనవచ్చుననియు, పాకిస్తాను ప్రభుత్వం నిర్ణయించిన మారకపురేటు ప్రకారంగానే కొనుక్కోవలెను గాని, మరొకరేటు ప్రకారంగా కొనుక్కొనరాదనియు, షెడ్యూల్డు బ్యాంకులు యీరీతిగా జరిపే డీలావాదేవీలకు పాకిస్తాను ప్రభుత్వబ్యాంకు హామీయివ్వజాలదనియు పాకిస్తాను ప్రభుత్వ బ్యాంకు మాత్రము ఇండియా రూపాయిలను కొని నిల్వచేయదనియు ఇటీవల పాకిస్తాను ప్రభుత్వం ప్రకటించెను.

ఒకవేళ పాకిస్తానులోని ఏ బ్యాంకు అయినను యిండియా రూపాయిలను కొనినప్పటికీ, పాకిస్తాను ప్రభుత్వ బ్యాంకు యిండియా రూపాయి మారకపు రేటును మార్చినట్లయితే, సదరు పాకిస్తాను షెడ్యూల్డు బ్యాంకు నష్టపడవలసివచ్చును. అందువల్ల పాకిస్తాను షెడ్యూల్డు బ్యాంకులు సాహసించి స్వతంత్రించి ఇండియా రూపాయిలను కొనజాలవు. పాకిస్తాను గవర్నమెంటు నిర్ణయించిన మారకపురేటు స్థిరంగా నిలిచేదికాదు. చాలా దుర్బలమైన రేటు. పాకిస్తాను ప్రభుత్వపు 100 రూపాయలు ఇచ్చి హెచ్చు సంఖ్యగల ఇండియా రూపాయలను కొనుక్కోవచ్చుననే ఆశతో ఒకవేళ పాకిస్తాను బ్యాంకులే యీ విధంగా ఏవైనా లావాదేవీలను జరుపుటకు పూనుకొనవచ్చును. కాని పాకిస్తాను ప్రభుత్వం జారీచేసిన ప్రకటనవల్ల పాకిస్తాను బ్యాంకులతో ఇండియా బ్యాంకుల వ్యాపారం ఏమిన్నీ మార్పు చెందజాలదు.

గత అక్టోబరు 5 తేదీని ఇండియాపార్లమెంటులో ఇండియాప్రభుత్వ ఖజానా మంత్రి డా॥ జాన్ మత్తాయిగారు ఉపన్యసించుచు దేశములోని ప్రస్తుత ఆర్థిక చిక్కులను తొలగించుటకై 8 అంశములుగల ఒక ప్రణాళికను వివరించిరి. రూపాయి మారకపురేటును తగ్గించుటవల్ల ఏర్పడిన సమస్యలను చర్చించుటకై కేంద్ర శాసనసభవారొక తాత్కాలిక కమిటీని నియమించిరి. ఈ కమిటీయొక్క మొదటి సమావేశం డా॥ జాన్‌మత్తయ్‌గారి అధ్యక్షతను నేడు జరిగెను. తమ అష్టాంశ ప్రణాళికను అమలుజరుపుటకై యింతవరకు జరుపబడిన చర్యలను మత్తయిగారు యీ కమిటీకి వివరించిరి. కమిటీ సభ్యులు కొన్ని సలహాలు సూచించిరి. ఈ సలహాలను గూర్చి చర్చించుటకై త్వరలోనే మరొక సమావేశం జరుపుటకు నిశ్చయింపబడెను.

### డేంకాథరిన్‌వాట్‌కు మద్రాసులో స్వాగతం

మద్రాసు, నవంబరు 19: బ్రిటిష్ ఆరోగ్య శాఖ వారికి నర్సింగ్ విషయంలో ప్రధాన సలహాదారైన డేం కాథరిన్ వాట్ గారికి నిన్న సాయంత్రం ఒసోబోహోటలులో మద్రాసు బ్రిటిష్ కౌన్సిలువారు గౌరవ స్వాగత మిచ్చారు. ఈ సభకు జస్టిస్ బషీర్ అహ్మద్ సయ్యద్, మంత్రి హెచ్. సీతారామరెడ్డి గారు, కౌన్సలర్ ప్రతినిధులు, తదితరులు హాజరయ్యారు. ప్రతినిధులకు బ్రిటిష్ కాన్సలేట్‌కు చెందిన హిక్మన్, ఎలియట్ గార్లు స్వాగత మిచ్చారు.

### బిన్నీ కార్మికుల సభ

బిన్నీ స్ట్రీమరు కార్మికుల సభ మదరాసు మహాజనసభయందు 20 తే సా 6 గ. శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణగారి అధ్యక్షతను జరుగును. బి. ఎస్. మూర్తి గారు ఎస్. సుబ్రహ్మణ్యగార్లు ఉపన్యసించెదరు.

### కీ. శే. ఆచంట సర్వేశ్వరుడుగారు

పాలకొల్లు, నవంబర్ 16: ఆచంట సర్వేశ్వరుడు గారు తమ 82వ ఏట 11-11-1949 తేదీని పోదూరు గ్రామంలో గతించినారు. వీరు ఆచంట గ్రామములో 1887 సం॥ రమున మాధ్యమిక పాఠశాలలు ప్రారంభించి తెలుగు పండితులుగా అప్పటి నుంచి 1935 సం॥ రము వరకు పనిచేసి 1935 లో రిటైరు అయినారు. వీరు నిరాడంబర జీవి. వీరు విద్యగల రోజుల ఎట్టి కొరతయును చూపక ప్రేమ కలిగి కను సమర్థతతో తెలుగు భాషను బోధించిరి. వీరికి సుమారు, యిరవైమంది శిష్యులున్నారు. ఇంకనూ మనుమలు మునిమనుమలు కలసి దాదాపు 150 మంది వరకూ బంధువర్గము కలరు. 1945 సం॥ రములో ఆచంట హైస్కూలు భవనమునకు శంకు స్థాపన చేసిరి.

అమెరికా సముద్రగర్భ పరిశోధకులు ఓటిస్ బార్టన్, వీరు 8 అడుగులవ్యాసం గల ఉక్కు సుండులో వుండి కాలిఫోర్నియా సముద్రప్రాంతంలో 4500 అడుగుల లోతుకు దిగారు. సముద్రగర్భంలోకి ఇంత లోతు చొచ్చుకుపోయినవారు వీరు తప్ప మరొకరు లేరు.

## "ఏటంబాంబులను తక్షణమే నిషేధించితీరాలి"

### బలాబలాలలో ఇప్పుడు రష్యాదే పైచెయ్యి అని అణుశక్తి గ్రంథకర్త అభిభాషణ

లండన్, నవంబర్ 17: "రాజకీయ, సైనిక రంగాలలో అణుశక్తి ఫలిత పర్యవసానాలు" అనే పేరుతో ప్రపంచ ప్రసిద్ధమైన గ్రంథము నొకదానిని రచించిన నోబెల్ బహుమాన సంపాదకుడు, ప్రొ॥ పి. ఎమ్. ఎస్. బ్లాకెట్ యు. పి. ఐ. విలేఖరితో ప్రసంగించుచూ ఇట్లుచెప్పెను:

ఆటంబాంబు యుద్ధంలో విజయానికి పరమసాధనంగా పరిగణింపబడే రోజులు గతించినవి. యుద్ధం అంటే భయంకలిగించడానికి సాధనంగా ఆటంబాంబు ఉపకరించగలదుగాని, యుద్ధాస్త్రంగా దాని సామర్థ్యం ఇప్పుడు శంకించబడుతున్నది. ఆటంబాంబును రష్యా కనిపెట్టిన దాని ఫలితంగా తమ వైఖరి కొత్తగా మార్చుకోవలసినంత పాశ్చాత్యరాజ్యాలు పైకి ఎంత గట్టిగా ఎన్నిసార్లు ప్రకటనలు చేసినా, వారు అలోచించేపద్ధతిలోను అనుసరిస్తున్న వైఖరిలోను కొన్ని మార్పులు క్రమంగా పొడచూపుతున్న వన్నదిమాత్రం విస్పష్టం. ఆటంబాంబు పరమాస్త్రమనీ, అది చేతులోవుంటే ఎంతటి శత్రువునైనా రోజులమీద సాధించవచ్చుననీ 1945-48 మధ్యకాలంలో అనుకుంటూ వుండేవారు. ఇప్పుడిప్పుడే ఈ విశ్వాసం చలించి, ఆటంబాంబునుగురించి వాస్తవికమైన అభిప్రాయాలు ప్రజల్లో కలగడానికి ఆస్కారం ఏర్పడుతోంది. బి-36 విమానంగురించి అమెరికాలో విమానశాఖకు నౌకాశాఖకు నడుమనవచ్చిన తీవ్ర వివాదము దీనికి దృష్టాంతంగా పేర్కొనవచ్చును. వెనక కొలిగా దారోజుల్లో బలాబలాలు తేల్చుకోవాలన్నంత దాకా కూడా పాశ్చాత్యరాజ్యాలు చెప్పినవి. అప్పటికీ ఇప్పటికీ. వాటి వైఖరిలో చాలా పెద్ద మార్పే వచ్చిందని చెప్పవచ్చును. ఆటంబాంబు యుద్ధనివారణ సాధనమేగాని పరమాస్త్రం కాదనీ, భూసైన్యం కూడా తగినంత ఉంటేగాని ఆటంబాంబులు ఉపయోజనం లేదనీ, హాయిట్ వాండెన్ బర్గ్ వంటి వాడుకూడా అంగీకరించెను. అమెరికా చేతులో ఉన్న ఆటంబాంబులు రష్యా దురాక్రమణను నివారించడానికి సాధనంగా ఉపకరిస్తున్నదన్నమాట నిజమే కావచ్చును. అవిధంగానే రష్యా ఎర్రసైన్యం పాశ్చాత్యదేశాల దురాక్రమణ వాంఛను హద్దులో ఉంచడానికి ఉపయోగపడుతూ ఉండవచ్చును. రష్యన్ సైన్యాలు నిజంగా తలుచుకుంటే, అవి అట్లాంటిక్ తీరంవరకు తేలిగ్గా అభియానం చేసి రాగలవు; ఎన్ని ఆటంబాంబులున్నా, వాటిని అడ్డుపెట్టగలశక్తి పాశ్చాత్యరాజ్యాలకు లేదు. పశ్చిమయూరప్ సమితి ఏర్పాటైనతర్వాత ఫీల్డ్ మార్షల్ మాంట్ గోమరీ పాశ్చాత్య యూరోపియ రాజ్యాల రక్షణకు పథకాలు వేయాలని తీరా ఆలోచించడం ప్రారంభించేసరికి, రష్యన్ సైన్యాన్ని అడ్డగించడానికి పాశ్చాత్యరాజ్యాలవద్ద తగినంతబలం లేదన్న విషయం ఆయనకు హఠాత్తుగా తెలిసిపోయింది. అమెరికా రష్యన్ పట్టణములమీద ఆటంబాంబులు కురిపించి అనేక నగరాలను నామరూపాలు లేకుండా నాశనం చేయవచ్చును, కాని యూరప్‌లో రష్యన్ సైన్యాల జైత్రయాత్రను వారించలేదు. ఇప్పుడు రష్యాకు ఎర్ర సైన్యమే గాకుండా ఎర్ర సైన్యంతోబాటు ఆటంబాంబుకూడా చేజిక్కింది. కొబట్టి ఇప్పుడు ప్రత్యర్థి వర్గాల బలాబలాలమధ్య సమానస్థితి తప్పి, మళ్లక్రమంగా రష్యావైపుకుపోతోంది.

ఏవిధంగా చూచినా ఆటంబాంబును నిషేధించడం ఒక్కటే ప్రపంచానికి శరణోపాయం. కాని అణుశక్తి కంట్రోలుకు బారుక్ వేసిన పథకం ఆచరణసాధ్యం కాదని ఏకగ్రీవముగా, మాంచెస్టర్ గార్డియన్ వంటి పత్రికలే ఇప్పుడు వ్రాస్తున్నవి. అణుశక్తి కంట్రోలుకు వేసే పథకం మాట ఎలాఉన్నా, ఆటంబాంబు తక్షణమే నిషేధించడం మాత్రం అవసరం."

### హాంకాంగుకు మరి ఆరు బ్రిటిషు యుద్ధ నౌకలు

సింగపూరు, నవంబరు 19: సింగపూరు నుండి రాగల మూడువారాలలోనూ బ్రిటిషు యుద్ధనౌకలు హాంకాంగుకు పోనున్నవి. యుద్ధం అయినతరువాత ఇంత నావికబలం హాంకాంగులో ఎన్నడూ లేదు.

చైనా ప్రాంతీయసముద్రం వెలుపల ఉండే బ్రిటిషు వాణిజ్యనౌకలు చైనా జాతీయవాదుల దాడినుండి రక్షింపబడగలవని ఇటీవల అటిన్ చెప్పియున్నారు. ఆయన ప్రకటన ఫలితంగానే ఈ యుద్ధనౌకలు పంపబడుతున్నవని భావింపబడుతున్నది.

## హరిజనులకు ఉచిత నివేశన స్థలాల మంజూరు

### రాష్ట్రప్రభుత్వ ఉత్తర్వు

ఏలూరు, నవంబరు 18: రాష్ట్రంలోని హరిజనులు, హరిజనులనుండి యితర మతములకు వెళ్ళిన వారందరికీ, ఉచితముగా యిండ్ల నివేశన స్థలముల నిచ్చుటకై ప్రభుత్వమువారు సంకల్పించి ఈ క్రింది ఉత్తర్వులు జారీ చేశారు.

ఇదివరకే ఇండ్లస్థలములు కలిగియుండిన వారున్నూ, యిండ్లస్థలములు ఖరీదుచేయగల పరిస్థితులలో నున్నవారున్నూ మినహా యితరహరిజనులు, హరిజనులనుండి మతాంతరులైన వారు, అందరికీ ఇండ్ల స్థలములు ఖరీదు లేకుండా ఉచితముగా యివ్వబడవలెను. ఇట్లిచ్చుటలో పల్లపుసాగు ప్రాంతములలో ఒక్కొక్కరియింటికీ 3 సెంట్లు చొప్పున, మెరకప్రాంతములో 5 సెంట్ల చొప్పున స్థలము యివ్వవలెను.

ఈ విధముగా ఇండ్లస్థలములు ఇచ్చు కార్యక్రమమునకు, అన్నిటికన్న ప్రథమస్థాన మివ్వవలసినదని కలెక్టర్లు కోరబడిరి. ఈ కార్యక్రమము అన్ని జిల్లాలలోనూ వెంటనే ప్రారంభము కావలెను. ఈ విధముగా ఇవ్వబడు 3 సెంట్లుగాని, 5 సెంట్లుగాని, సాముదాయికోపయోగము నిమిత్తము అనగా, వీధులు, సందులు మొదలైనవానికి అక్రమించబడుభూమిగాక అదనముగా యివ్వబడవలయును. సాముదాయికోపయోగమునకు ఆక్రమించబడు భూమి ఖరీదు యిచ్చవలసి వచ్చినచో పూర్తిగా ప్రభుత్వమే భరించును.

ఈ విధముగా క్రొత్తగా నివేశన స్థలములు ఏర్పాటుచేయుటలో, హరిజనులు గాని, మతాంతరులుగాని వారిదివరకే నివసించుచున్న ప్రదేశము నుండి సాధ్యమైనంతవరకూ కదల్పబడకుండునట్లు కలెక్టర్లు యత్నింపవలయును. కాని, ఆప్రదేశము సబబైన యితర కారణములవలన, అనగా నివాసయోగ్యము కాకుండుట మొదలైన కారణములవలన వదలి వేయవలసి వచ్చినపుడు, వారి పనిపాటలకు సాధ్యమైనంత సమీపములోను, సాధ్యమైనంతవరకు సవర్ణ హిందూనివాస ప్రదేశములలో గాని, వానికి సమీపముగా యుండు ప్రదేశములలో గాని నూతన నివాస ప్రదేశము నేర్పాటు చేయుటకు ప్రయత్నింపవలెను.

ఈ విధముగా ఉచితముగా నివేశన స్థలములనిచ్చు పద్ధతియును ఈ తరహా కలెక్టర్లవద్ద అర్జీలు నిమిత్తము తయారుగాయున్న కేసులకు కూడ వర్తించును. అయితే వానిలో, ఇదివరకే తీర్పు ఇవ్వబడియున్న వానికి వర్తింపదు.

ఉచితముగా నివేశనస్థలముల నిచ్చే పద్ధతియును, ఆదివరకే యిండ్లస్థలములు లేనివారికీ, ఖరీదు యివ్వగలస్థితిలోనున్న వారికీ, వర్తింపకుండ చూచేనిమిత్తము, కలెక్టరు ఉచితస్థలముల కోరిన ప్రతిగృహ యజమానియొక్క ఆర్థికస్థితి, ఖరీదును యివ్వగల శక్తిని పరిశీలించి, అతడెంత వరకూ, నివేశన స్థలపు ఖరీదు యివ్వగలడో నిర్ణయింపవలెను. (స్వ. వి.)

## ధాన్యసేకరణ తగ్గుదల

మద్రాసు, నవంబరు 19:

నవంబరు 12 వ తేదీతో అంతమయ్యే వారమునందు చెన్న రాష్ట్రమున ధాన్య సేకరణ 15700టు. జరిగెను అటుక్రితం వారం 25876టు. తంజావూరులో సేకరణ తగ్గినది. సంఖ్యల వివరం - యీ వారం గతవారం:- తూ. గోదావరి 1099-832టు. గుంటూరు 465-344టు. కృష్ణ 138-235టు. నెల్లూరు 252-378 టు తంజావూరు 8802 - 12910టు. ప. గోదావరి 2622 - 1080టు. నవంబరు 12తే. రాష్ట్రంలో సరకు 199,999టు. నవంబరు 17తే. సరకు నిలవ 6449టు. ఉప్పుడు బియ్యం. 3059 టు పచ్చిబియ్యం ఇది 27రోజులకు సరిపోవును.

### ఎస్. వి. గోపాలరావుగారు

జెమిని స్టూడియోసుకి చెందిన ఎస్. వి. గోపాలరావుగారు రాయలు ఫోటోగ్రాఫిక సొసయిటీ (ఇంగ్లండు) సభ్యులుగ చేర్చుకొనబడిరి. వీరిదివరకే అమెరికా ఫోటోగ్రాఫిక సొసయిటీ సభ్యులుగా చేర్చుకొనబడిరి.

### ఈడిగకులం

ఆంధ్రరాష్ట్ర గౌడమహాజన సంఘం వారు కోరినందున ఈడిగ కులం పేరు 'గౌడ' కులంగా మార్చుటకు ప్రభుత్వం వారు ప్రజాభిప్రాయం తెలుసుకొనగా పలువురాసంఘంవారు ప్రతిఘటించు నున్నందున మార్చ వీలులేదని ప్రకటించిరి.

### విశాఖపట్నం ప్యాసెంజరు ఆలస్యం

మద్రాసు, నవంబరు 19: నేడుదయము 10 గంటలకు మద్రాసుకు చేరవలసిన విశాఖపట్నం ప్యాసెంజరు 8 గంటలు ఆలస్యంగా చేరునని తెలిసినది.

### రాజు జన్మదినం సెలవుకాదు

న్యూఢిల్లీ, నవంబర్ 18: 1950 నుంచి రాజు జన్మదినం, (జూన్ 9) సెలవు దినంగా పరిగణించరు.

1950 నుంచీ భారత ప్రభుత్వపు సెలవు దినాలు సంవత్సరానికి మొత్తం 21 రోజులు:

బ్యాంకు సెలవు ఇద్-ఉ-మిలాండ్ శివరాత్రి, హోలీ, శ్రీరామనవమి, గుడ్‌ఫ్రైడే మొహర్రం, ఇడ్-ఉల్-ఫిటర్, స్వాతంత్ర్య దినం, జన్మాష్టమి, ఇడ్-ఉ-జహా, గాంధీ జన్మదినం, దసరా, మొహర్రం, దీపావళి, గురు నానక్ జన్మదినం, క్రిస్టమస్— ఇవి మాత్రమే సెలవు రోజులు.

### చిన్న రేవుల పాలనా నివేదిక

మదరాసు, నవంబరు 18: సూర్యుడి తప్ప తతిమా చిన్న రేవులలో 1946-49లో 29. 35కోట్లు విలువ సముద్ర వ్యాపారము జరిగినట్లు ప్రభుత్వము ప్రకటించిన నివేదిక తెలుపుచున్నది.

నివేదిక సంవత్సరములో కోస్తా నాగపట్టణం, బిమ్లిపటాం. కాలికట్ రేవుల పేర్లను కాకినాడ, నాగపట్టణం భీమునిపట్నం, భోజనోడ్ అని మార్చిరి.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.

# మదరాసు సెనేటు

## వయోజన విద్యా డిప్లమా తరగతి

హిందీశాఖ ప్రారంభం

మదరాసు, నవంబరు 19: మదరాసు విశ్వవిద్యాలయం సెనేటు సభ నిన్న వైసు ఛాన్సలరు డా॥ ఎ. లక్ష్మణస్వామి ముదలియారు అధ్యక్షత నా జరిగినపుడు, కాలేజి తరగతులలో విద్య హిందీలో బోధించుటగూర్చి చర్చించిరి. ఈ విషయమై ఇండియా ప్రభుత్వంవారు యీ విశ్వవిద్యాలయం అభిప్రాయం అడుగగ, సిండికేటువారు ప్రత్యేకసంఘాన్ని నియమించి విచారించిరి. కమిటీ వారు విచారించి ఇంగ్లీషుద్వారా విద్యనేర్పే పద్ధతిని బలవంతంగా తీసివేయడం విద్యార్థులకు దేశానికి నష్టదాయకమనియు, రాష్ట్రీయ భాషలను ప్రోత్సహించుట మంచిదేకాని, ఇంగ్లీషును తొలగించి యితోభాషకా స్థానం యిచ్చుట మంచిది కాదని ప్రత్యేకసంఘంవారు శిఫార్సు చేసిరి. దీన్ని సిండికేటువారు అంగీకరించిరి. తిరిగి సిండికేటు విచారణకు పంపమని కేవాలిరావుగారు ప్రతిపాదింపగ సెనేటు సభలో కొంత చర్చ జరిగినాక, తీర్మానం ఓడిపోయెను.

వయోజన విద్య నేర్పుటకు డిప్లమా తరగతి ఏర్పాటుచేయుట కంగీకరించుచు తీర్మానించబడెను.

విశ్వవిద్యాలయానికి చెందిన కాలేజి యున్న ప్రతిజిల్లాలోను ఒక విశ్వ విద్యాలయం ఎక్స్టెన్షనుబోర్డు ఉండాలని తీర్మానించబడెను.

హిందీశాఖ స్థాపించుటకు ప్రభుత్వం వారు గ్రాంటు యిస్తామన్నారని సభ వారికి తెలుప బడెను. ఈ శాఖస్థాపించుటకు సెనేటు యిదివరకే తీర్మానించి యుండెను.

# గారపిర్కాలో గ్రామాభివృద్ధి కార్యక్రమము

శ్రీకూర్మం, నవంబరు 14: ఈ నెల 13 న శ్రీకాకుళం రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుగారి అధ్యక్షతను గార ఫిర్కా అభివృద్ధిసంఘసభ శ్రీకూర్మంలో జరిగినది. సమావేశానికి జిల్లా రహదారుల ఇంజనీరు, జిల్లా పశుశాఖ ఉద్యోగి, మొదలగు ఉద్యోగులునూ, కమిటీసభ్యులు శ్రీ కప్పగంతుల సుబ్బారావుగారునూ హాజరైనారు.

1949-50 సంవత్సరమునకు, ఒక నిర్దిష్టమైన కార్యక్రమును చర్చించి ఆమోదించిరి. ఇంతవరకూ ఫిర్కా అభివృద్ధి కార్యక్రమంలో ప్రారంభించి సాగించుచున్న రాధారీ అభివృద్ధి, మంచినీటి సరఫరా కార్యక్రమములనూ, యీ సంవత్సరం పూర్తిగావించుటయేగాక, అంపోలు, చిన్నతూలుగు, తూలుగు, యాళ్ళపేట, కొయ్యవపేట, లింగాలవలస గ్రామాదులకు శ్రీకాకుళం కళింగపట్నం రోడ్డును కలుపు చూ రోడ్లు వేయించుటకునూ, పూసర్లపాడు, వోమరవిల్లి ఉప్పుగల్లి దగ్గరను కొన్ని గ్రామాలలో దాహముల నీటి సదుపాయమునకు నూతులు త్రవ్వించుటకును, కళింగపట్నం మత్స్యకార గ్రామంలోని పాత దాహముల నూతులు మరామత్తు చేయించుటకునూ తీర్మానించిరి.

కళింగపట్నం, శ్రీకూర్మం, వోమరవిల్లి ఇప్పిలి గ్రామాలలో రేడియోలు పెట్టుటకునూ, ప్రత్యేకశ్రద్ధతో గ్రామ పారిశుధ్య కార్యక్రమును సాగించుటకునూ తీర్మానించబడినది.

వోమరవిల్లి గ్రామంలో ప్రజారోగ్య వైద్యకేంద్రమును ప్రభుత్వము వారు శాంక్షను చేసినారు. ఈ కేంద్రము త్వరలోనే ఆరంభము కాగలదు.

# హిందూ యువజనసంఘ గ్రంథాలయం

ఏలూరు, నవంబరు 18: హిందూయువజనసంఘ గ్రంథాలయ సాహిత్య నాటక వర్గాల ప్రారంభోత్సవము నిన్న సాయంకాలం సంఘభవనమందు చెరుకువాడ వెంకటనరసింహంగారిచే గావింపబడెను. సోమంచి లింగయ్యగారు అధ్యక్షతవహించిరి.

నరసింహంగారు, జాతి అభివృద్ధికి, సాహిత్యము, నాటకకళల ప్రాముఖ్యమును గురించి ఉపన్యసిస్తూ, ఇట్టి సంస్థల విషయమై ప్రత్యేకశ్రద్ధ గనపర్చవలెననిరి. పార్లమెంటరీశాఖ విషయమై ప్రస్తావిస్తూ, ప్రజాస్వామిక ప్రభుత్వములో, ప్రజలకు సంబంధించిన దైనందిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక సమస్యలనుగురించీ, ప్రభుత్వము చేయుచుండెడి చట్టములనుగురించీ ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయుటకు ప్రజాభిప్రాయమును ప్రభుత్వమునకు సువ్యక్తము చేయుటకూ ఇట్టి పార్లమెంటరీ సంస్థలు అధికమైన సేవ చేయగలవని నుడివిరి. సోమంచి లింగయ్యగారు కమ్యూనిజం వల్ల దేశమునకు రాగల ముప్పు విషయమై చెప్పి, కమ్యూనిజం కేవలం శాసనములనిరోధ చర్యలవల్ల అణచబడజాలదనియు, ప్రజలలో దానివిషయమై సత్యమును ప్రచారముచేసి, ప్రజల మనస్సులను దానినుండి మరల్చుటవల్ల దాని వదలకొట్ట వీలగునని యూ, అందులకిట్టిసంస్థ లుపయోగమని యూ నుడివిరి. కార్యదర్శి పి. శ్రీరామమూర్తిగారి వందనములతో సభ ముగిసెను.

స్వ. వి

# 'అస్సాంలో కమ్యూనిస్టుల ప్రవేశం వార్త'

## అసత్యమని కేస్కార్ ప్రకటన

కలకత్తా, నవంబరు 18: ఇండియా ప్రభుత్వ విదేశాంగశాఖ డిప్యూటీమంత్రి డా॥ బి. వి. కేస్కారుగారు ఇటీవల అస్సాంలో కేంద్రప్రభుత్వ పరిపాలిత ప్రాంతములందు పది దినములు పర్యటనము చేసి నేటి సాయంకాలము కలకత్తా కు విచ్చేసిరి. అస్సాంలోని కేంద్రప్రభుత్వ పరిపాలిత ప్రాంతములు కొండజాతులవారికి నివాసస్థానములు. ఈ ప్రాంతములలోనికి కమ్యూనిస్టులు రహస్యముగా ప్రవేశించుట లేదని కేస్కారుగారు చెప్పిరి. ఈ ప్రాంతవాసులగు కొండతెగల ప్రస్తుత పరిపాలన విషయమై కేస్కారుగారిట్లు చెప్పిరి.

ఈ కొండతెగలవారికి మిగిలిన భారతదేశముతో సంబంధము లేకుండా చేసి వారిని ప్రత్యేకంగా ఒక విచిత్ర వస్తువుగా భద్రపరచి యుంచవలెనని బ్రిటిష్‌వారు ఇదివరలో ప్రయత్నించిరి. ఈ కొండజాతులవారికి మిగిలిన అస్సాం ప్రాంతంలో కలిసియుండుట యిష్టము లేదనెడి ఉద్యమమును బ్రిటిష్‌వారే కల్పించిరి. కాని యిప్పుడు వారికి అటువంటి ప్రత్యేకభావము లేనేలేదు. తాముకూడా మిగతా భారతదేశమునకు సంబంధించిన భారతీయులమే అనెడి భావము వారికి కలదు. అదిన్నీగాక, అస్సాంలోని మిగతా ప్రాంతముయొక్క పరిపాలనకును యీ ప్రాంత పరిపాలనకును విశేష వ్యత్యాసములేదు. ఈ కొండజాతులవారు తమకు పాఠశాలలు కావలెననియు ఆస్పత్రులు కావలెననియు, రోడ్లు కావలెననియు కోరుచున్నారు. గత రెండేండ్లలోను పాఠశాలలు, ఆస్పత్రులు తత్పూర్వపు అయిదేండ్లలోకంటె ఎక్కువగా ఏర్పాటు చేయబడినవి. ఈ ప్రాంతములో భూమి సర్వే సక్రమంగా జరగలేదు, జనాభా లెక్కలు కూడా సరిగా తయారుచేయబడలేదు. అస్సాంలో 40 వేల చతురపుమైళ్ళ ప్రాంతం కొండజాతులవారు నివసించు ప్రాంతమైయున్నది. ఇందులో సగము భాగము కేంద్రపరిపాలన క్రింద నున్నది.

చైనాలోను బర్మాలోను ఇటీవల జరిగిన సంఘటనల మూలంగా యీ అస్సాం సరిహద్దు ప్రాంతమునకు కొంత ప్రాధాన్యమేర్పడినది. ఆ ఉత్తర దేశంలోనూ తూర్పు దేశంలోనూ పరిస్థితులు ఇంకా మార్పు చెందే కొలదీ యీ అస్సాం సరిహద్దు ప్రాంతం ఇంకా ప్రాముఖ్యము వహించ గలదు.

ఈ ప్రాంతములో అబోర్లు, మిష్మీలు, ఖాప్టీలు, మొదలైన కొండజాతులవారు కలరు. వీరందరిని సాంఘికముగా ఆర్థికముగా వృద్ధిలోనికి తీసికొని రావలెనని ఇండియా ప్రభుత్వము సంకల్పించి యున్నదనెడి సందేశమును వారికి అందజేయడమైనది.

లోహిత నదీలోయ ప్రాంతంలోని చౌఖాముకద్ద ఖాప్టీలఅను తెగవారి సమావేశములో డా॥ కేస్కారుగారు ఉపన్యసించుచు వారి విద్యాసౌకర్యముల విషయములోను రోడ్లు నిర్మించు విషయములోను వారికి ఇండియా గవర్నమెంటు తోడ్పడగలదనియు, యీ కొండజాతులవారుకూడా గవర్నమెంటుకు తోడ్పడి వ్యవహరించుచుండవలెననియు చెప్పిరి. ఇటువంటి కేంద్రపరిపాలిత ప్రాంతములు 6 ఖండములుగా నున్నవి. వానిలో రెండు ప్రాంతములను కేస్కారుగారు సందర్శించిరి. సుమారు 300 మైళ్లు పర్యటనముచేసిరి. అస్సాం గవర్నరైన శ్రీ ప్రకాశ్‌గారు వారివెంట ఉండి కొంతవరకు పర్యటనం చేసిరి. కొండజాతులవారు తమ దుస్తులను కత్తులను తలపాగలను డా॥ కేస్కారుగారికి కానుకలుగా సమర్పించిరి. ఆ కొండజాతులవారి నాయకులకు డా॥ కేస్కార్‌గారు ప్రశస్తి నూలును బహుమానంగా యిచ్చిరి.

కేస్కారుగారు రేపుఉదయము ఢిల్లీకి విమానం మీద వెళ్ళెదరు.

# అండమాన్లలో మాజీ సైనికుల వలస

పూనా, నవంబరు 19: భారత ప్రభుత్వం ఒక వందమంది మాజీ సైనికులకు అండమాను ద్వీపాలలో వసతులు ఏర్పరచటానికి నిర్ణయించింది. వీరి కుటుంబాలకు భారతప్రభుత్వం కొంత ఆర్థికసహాయం కూడా చెయ్యగలదని తెలుస్తున్నది. ఈ వందమందికి అండమానులలో ఒక్కొక్కరికి 8, లేక 9 ఎకరాల భూమి ఇస్తారని కూడా తెలుస్తున్నది.

# అఖిలభారత హిందీ పరిషత్తు

## ఈ నెల 23, 24 తేదీల్లో ఢిల్లీలో జరుగును

ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘము (విజయవాడ) కార్యదర్శి శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారిట్లు వ్రాయుచున్నారు:

రాజ్యాంగపరిషత్తు హిందీని రాజభాషగా అంగీకరించుచు తీర్మానించిన పిమ్మట హిందీ లేక హిందూస్తానీ ప్రచారమును గత 30 సంవత్సరములనుండి నడుపుచున్న వివిధ ప్రాంతములలోని ముఖ్య కార్యకర్తలు తమ కర్తవ్యమును నిర్ణయించుకొనుటకు శ్రీ మోటూరి సత్యనారాయణ, శ్రీమన్నారాయణ అగ్రవాల్‌గార్ల ఆహ్వానముపై కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ శంకరరావు దేవ్‌గారి అధ్యక్షతను యీ నెల 2, 3 తేదీలలో వర్ధాలో సమావేశమైరి. ఈ సమావేశములో హిందీ, హిందూస్తానీ విషయమై విపులముగా చర్చించి రాజ్యాంగపరిషత్తువారి "రాజభాష" తీర్మానమును అంగీకరించుచు, ఆ తీర్మానము ప్రకారము హిందీభాషా స్వరూపమును హిందూస్తానీ, సంస్కృతభాషల సహకారముననే గాక యితర ప్రాంతీయభాషల సమన్వయముతోకూడా నిర్మాణముచేసి ప్రచారము చేయుటకు, అఖిలభారత హిందీ పరిషత్తును స్థాపించవలయునని నిర్ణయించి ఆ పరిషత్తుయొక్క నియమావళి ముసాయిదా తయారుచేసిరి.

పరిషత్తు స్థాపనవిషయమై విపులముగా చర్చించి నిర్ణయించుటకుగాను యీ నెల 23, 24 తేదీలలో ఢిల్లీలో సమ్మేళనము జరుగును. ఆ సమ్మేళనములో వివిధ ప్రాంతములలోని హిందీభాషా ప్రచారకులు, వివిధభాషా విజ్ఞులు, రాజ్యాంగ పరిషత్తు సభ్యులు పాల్గొందురు.

అఖిలభారత హిందీ పరిషత్తుయొక్క ముఖ్య ఆశయము హిందీభాషా ప్రచారమునకు పూనుకొనుటయే గాక దేశీయభాషలన్నిటికినీ, రాజభాషయగు హిందీతో సమానమైన ప్రతిపత్తి నొసగి వాటి అభివృద్ధికి దోహదమొసగుట, నాగరలిపిలో యితర ప్రాంతీయభాషల నేర్చుకొనుటకు తగు అవకాశము కల్పించుచు, హిందీ మాతృభాషగా గలవారు తప్పనిసరిగా మరొక ప్రాంతీయభాషను నేర్చుకొనవలెనని విధించుట, అయియున్నది.

ఈ ఆశయములతో నెలకొల్పబడనున్న అఖిలభారత హిందీ పరిషత్తుద్వారా భాషావిషయమైన సమస్యలన్నియు పరిష్కరింపబడు సదవకాశమున్నందున, అందరు దానికి తగు ప్రోత్సాహమిచ్చి ఆదరింతురని ఆశించుచున్నాను.

# హరిజన క్రైస్తవ మహాజన సభ

విజయవాడ, నవంబరు 11: కృష్ణాజిల్లా క్రైస్తవ, హరిజనులమహాసభ అన్నె అంజయ్యగారి అధ్యక్షతను నిన్న జరిగినది. జిల్లాలోని అన్ని తాలూకాలనుండి ప్రతినిధులేతెంచిరి. ఎన్. జి. రంగాగారు క్రొత్త రాజ్యాంగములో మాల, మాదిగల భవిష్యత్తు, విద్యగురించి ఉపన్యసించి, పెద్ద ప్రజలందరు కాంగ్రెసులో చేరి కాంగ్రెసు సంస్థ తమదిగా చేసికొనవలెననిరి. పిమ్మట పాస్టరు డీ కాలబోహోసు, పి. కాళిదాసు, అత్తోట రత్నముగార్లు మొదలగు ప్రముఖులు ప్రసంగించిరి. అన్నె అంజయ్యగారు తుపానుపేదలకు తీరనిదెబ్బని, ఈ కష్టములను గవర్నమెంటు ప్రజలసహకారములో పోగొట్టు కొనవలెనని నుడివిరి. అనంతరం అప్పికట్ల జోసెఫ్‌గారు ఈ దిగువ తీర్మానములను ప్రతిపాదించగా ఆమోదించిరి. తుపానువలన ప్రాణములు కోల్పోయినవారి కుటుంబములకు సానుభూతి, వెల్లడించడమైనది. తుపానువలన యీ జిల్లాలో అనేక గూడెములు నేల మట్టమై ప్రజల ఆర్తనాదములు మిన్ను ముట్టుచున్నవి. కావున కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు ప్రజలకు యిళ్లు కట్టుకొనుటకు కలప, కట్టుకొనబట్ట, సహాయముచేసి ఆరోగ్యశాఖ సిబ్బందిని పెంచి వ్యాధులు ప్రబలకుండ చూడవలెనని కోరడమైనది.

అస్పృశ్యత నివారణలో సవర్ణహిందూ కాంగ్రెసువాదులు, గవర్నమెంటు తగుశ్రద్ధవూనవలెనని, ఒకేసాంఘిక వ్యవస్థ, అలవాట్లు కలిగిన క్రైస్తవులను హరిజనులను విడదీయక, క్రైస్తవ విద్యార్థులకు వుచిత విద్యాదానము చేయ ప్రభుత్వమును కోరడమైనది. క్రొత్తరాజ్యాంగమున హరిజనులకు మాత్రమే ప్రత్యేకస్థానములు కలవు. గాన క్రైస్తవ గురువులు, వుపాధ్యాయులు, మిషనరీలు పనిచేసి తమ ప్రజలు కాంగ్రెసుతో వుండునట్లు జనరల్ స్థానములలో క్రైస్తవులు పోటీచేసి గెల్చునట్లు కృషి చేయవలసినదిగా కోరడమైనది.

శ్రీ జె. సి. కుమారప్ప కమిటీవారు చేసిన సిఫార్సులను, ఆచరణలో పెట్టించవలెనని, ఆ రిపోర్టును దృష్టియందుంచుకొని భూసంస్కరణ విధానము ఆమలులోనికి తెచ్చుటకు కేంద్రప్రభుత్వమునకు అనుజ్ఞనివ్వమని కాంగ్రెసును కోరడమైనది.

# తుపాను ప్రాంతాల్లో ప్రధాని పర్యటించాలి

## రాజోలుసభలో తీర్మానం

సాంబమూర్తి ప్రభృతుల ప్రసంగాలు

రాజోలు, నవంబరు 19: ఈ ప్రాంతంలో తుపాను తీవ్రతానికి గురి అయిన గ్రామాలను అసెంబ్లీ మాజీ స్పీకరు సాంబమూర్తి, కల్లూరి శాస్త్రి, దీక్షితులు, ఆకుల బుల్లిస్వామిగార్లు నిన్న పర్యటించి వీక్షించారు. పర్యటననుండి తిరిగివచ్చిన తరువాత నిన్న సాయంత్రం సాంబమూర్తిగారు, శాస్త్రిగారు రాజోలులో ఒక పెద్దసభలో ఉపన్యసించారు.

ఇదివరకెప్పుడూ కనివిని ఎరుగనంతటి ఈ తుపానువల్ల నష్టపడిన ప్రజలకు వెంటనే సహాయం చేయవలసిన ఆవశ్యకతనుగూర్చి సాంబమూర్తిగారు ఉద్ఘాటిస్తూ ఒకగంటసేపు మాట్లాడారు. ఆంధ్రరాష్ట్రం తక్షణమే ఏర్పడాలనికూడా ఆయన ఉద్ఘాటించారు.

ఆంధ్రరాష్ట్రం విడిపోయిన తర్వాత మిగతా రాష్ట్రానికి పేరేమివుంటుందని సభలో ఒకరడగ్గా, కేరళ, కన్నడ ప్రాంతాలు, పరిసర ప్రాంతాలతో కలిసి మద్రాసు నగరం విడిపోయేవరకు అది మద్రాసురాష్ట్రం అనే పిలువబడుతుందనీ సాంబమూర్తిగారన్నారు.

సభలో ఈ తీర్మానం చేయబడింది. పీడైన సహాయమంతా చేసేందుకు అసలు, జరిగిన నష్టమెంతో తెలుసుకోవలసి వుంటుంది. కనుక మద్రాసు ప్రధాని తక్షణం ఈ ప్రాంతాలకువచ్చి సంచారం చెయ్యాలి. రాజోలు తాలూకాలో ఇండ్లకు, పశువులకు, పంటలకు, తోటలకు సంభవించిన మొత్తం నష్టం 8 కోట్ల రూ. లదాకా వుంటుంది. ఆంధ్రదేశంలోని తుపాను నష్టప్రాంతాలనుండి ఆహారపదార్థాల ఎగుమతులను వెంటనే నిలిపివెయ్యాలి.

మరొక తీర్మానంలో సభవారు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చి గత 16 వ తేదీన తీర్మానించిన కాంగ్రెసు కార్యవర్గమును అభినందించారు. మద్రాసునగరమును, పరిసరప్రాంతాలతో కలిపి ద్విభాషా రాష్ట్రంగా నిర్మించాలని కేంద్రప్రభుత్వమును కోరారు. మద్రాసు ద్విభాషా రాష్ట్రం ఏర్పడినతరువాతకూడా, అనగా, ఆంధ్రులు వేరే స్వంత రాజధానిని కట్టుకొనేవరకూ నూత్న ఆంధ్రరాష్ట్ర రాజధానిని మద్రాసులోనే వుంచాలనికూడా వారు కోరారు.

నేటిఉదయం సాంబమూర్తి గారు పరివారంగా బయలుదేరి వెళ్లారు. (స్వ. వి.)

# ఆదిమవాసుల కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానాలు

గుంటూరు, నవంబర్ 14:

ఈ నెల 12-వ తేదీన ఆంధ్రరాష్ట్ర ఆదిమవాసుల కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము గుంటూరు ఎరుకలపాలెం హాస్టలునందు సమావేశమై, ఆదిమవాసులను ఆర్థిక, సాంఘిక విజ్ఞానాదివిషయములలో అభివృద్ధి చేయుటకొక ప్రణాళికను రూపొందించి అమలు పర్చునట్లు ప్రభుత్వమును కోరుచును, భారతీయ ఆదిమజాతి సేవకసంఘ ఉపాధ్యక్షులు శ్రీ ఎ. వి. ఠక్కర్ బాపా గారి 81-వ జన్మ దినోత్సవమును ఆదిమవాసులందరు ఆచరించవలెనని, ఆంధ్రరాష్ట్ర ఆదిమవాసుల కాంగ్రెసు సంఘమును 'భారతీయ ఆదిమజాతి సేవకసంఘమునకు అనుబంధ మొనర్చవలెనని తీర్మానించింది. "ఆంధ్రరాష్ట్రములో ఆదిమవాసుల జనాభా ఒక్కొక్క జిల్లాయందు లక్షకు పైబడియున్నది. నూతనరాష్ట్రం ఏర్పడినతోడనే ఆదిమవాసులకు జిల్లాకొక స్థానమును ప్రత్యేకించవలెను. మరియు కర్నూలు, గుంటూరు నెల్లూరు జిల్లాలలో ఆదిమవాసులసంఖ్య రెండు లక్షలకుమించియున్నందున అదనముగ ఒక్కొక్క స్థానమును ఆజిల్లాలకు. కేటాయించుచూ శాసనసభలో మొత్తం 15 స్థానము లివ్వవలెనని కూడా తీర్మానం జరిగింది.

# హరిజనవాడకు వయోజన విద్యామందిరం

హిందూపురం, నవంబరు 13: ప్రభుత్వ వయోజన విద్యా శిక్షణాకేంద్రంవారు నిన్న రాత్రి స్థానిక హరిజనవాడలో ఒక వయోజన విద్యామందిరమును నెలకొల్పిరి. మందిర ప్రారంభోత్సవమును స్కూళ్ళ డిప్యూటీ ఇన్స్పెక్టరు కమలమ్మగారు జరిపిరి. వయోజన విద్యాగౌరవ దర్శకుడు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షత వహించిరి. కమలమ్మగారు ఇటువంటి విద్యామందిరముల ఆవశ్యకత, వాటివల్ల ప్రజలకు గలుగు లాభములను గురించి ప్రసంగించిరి. హరిసర్వోత్తమరావుగారు నిరక్షరాస్యతను నిర్మూలించవలసిన ఆవశ్యకతను, వయోజన విద్య అవసరమును, దానివలన ప్రజాబాహుళ్యమునకు కలుగు మంచిని గురించి విపులముగ నుపన్యసించిరి. వయోజన విద్యా కేంద్రప్రధానోపాధ్యాయుడు ప్రకాశరావుగారు కూడ మాట్లాడిరి. హైస్కూలు ఉపాధ్యాయుడు కె సుబ్బారావుగారు ఒక నమూనా పాఠమును చెప్పిరి.

(స్వ. వి.)

# తిరుపతి దేవస్థానం ఆదాయంత గ్గదల

1948-49 సం॥ నివేదికా ప్రకటన

తిరుపతి, నవంబరు 16: "దేశమంతటా వ్యాపించిన ఆర్థిక మాంద్యం ఫలితంగా తిరుమల, తిరుపతి దేవస్థానముల కానుకల, ఆస్తులయొక్క ఆదాయమునకు కొంతదెబ్బతగిలినది. 1948-49వ సంవత్సరములో హైదరాబాదులో సాగిన గల్లంతుల వల్ల కూడా ఆదాయమునకు కొంత భంగం వాటిల్లినది. అని 1948-49 సం॥ పు టి. టి. డి. పరిపాలనా నివేదికను ప్రకటిస్తూ దేవస్థాన కమీషనర్ వి. వీరాస్వామినాయుడుగారు అన్నారు.

ఆ సం॥లో మొత్తం అన్నిరకాల ఆదాయము కలిపి రూ॥ 39,29,678-1-9. వ్యయము రూ॥ 23,79,911-1-0.

దేవస్థానముల సంఘం చేసిన దాన ధర్మముల మొత్తం 61 వేల రూ॥.

ఆ సం॥లో జరిగిన ముఖ్య ఉత్సవములు సభలు "పేరోల్కంటూ,"అన్నమాచార్యుల జయంతిఉత్సవం," తిరుమలలో హిందూ మత వేసంగి పాఠశాల, తిరుమల గ్రామాభివృద్ధికిగాను ఇంజనీయర్ భక్తుల సమావేశం, రామస్వామిరెడ్డియార్ చే తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర కళాశాల శంఖుస్థాపనం మున్నగు వానిని నివేదిక ఉదహరిస్తున్నది.

# నెహ్రూ జన్మదినోత్సవములు

విజయవాడ

భారతప్రధాని పండిట్ నెహ్రూ 61వ జన్మదినోత్సవం సేవాదళ శిక్షణాశిబిరం ఆధిపత్యాన 14 వ తేదీన నూకల రామస్వామిగారి అధ్యక్షత క్రింద జరిగింది. అయ్యదేవర కాళేశ్వరరావుగారు నెహ్రూ విగ్రహాన్ని ఆవిష్కరించారు. డా॥ టి. వి. యస్. చలపతిరావుగారు, అప్పికట్ల జోసెఫ్‌గారు నెహ్రూ దేశసేవ, త్యాగంగూర్చి ఉపన్యసించారు.

కడప

ఈ నెల 16 వ తేదీన కడప జిల్లాబోర్డు వారు ప్రప్రథమ సమావేశం, టి. పుల్లారెడ్డిగారి అధ్యక్షతక్రింద జరిపి 60 ఏండ్లు నిండిన పండిట్ నెహ్రూకు శుభాకాంక్షలు తెలుపుతూ తీర్మానంచేశారు.

విజయనగరంలో

పట్టణ హరిజన సంఘంవారు, పట్టణ తోళ్ళ కార్మికసంఘంవారు నెహ్రూ జన్మదినోత్సవాలు చేశారు.

భీమవరంలో

అనబి బాపిరాజుగారి అధ్యక్షతక్రింద గంగయ్య మెమోరియల్ హైస్కూలులో నెహ్రూ జన్మదినోత్సవ సభజరిగింది.

నిడుబ్రోలులో

స్థానిక హైస్కూలులో ప్రధానోపాధ్యాయుని అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. పచ్చలతాడిపర్రులో జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసువారి ఆధ్వర్యాన నెహ్రూ జన్మదినం జరిగింది.

నిడదవోలులో

స్థానిక విజ్ఞాన కళాశాల విద్యార్థులు నెహ్రూ పండితుని జన్మదినోత్సవం జయప్రదంగా చేశారు. కళాశాలవద్ద కస్తూరి సూర్యప్రకాశ రావుగారి అధ్యక్షతక్రింద బహిరంగసభ జరిగింది. ఎస్. జగన్నాథరావు, గోపరాజు వెంకటానందంగార్లు, ఇంకా పలువురు నెహ్రూ జీవితమును గూర్చి ఉపన్యసించారు.

గుంటూరులో

జిల్లా విద్యార్థి కాంగ్రెసువారు కొమ్మినేని వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతక్రింద నెహ్రూ జన్మదిన సభజరిపారు.

వెంకటగిరిలో

పట్టణ కాంగ్రెసు యువజనసంఘము నెహ్రూ జన్మదినోత్సవాలను కడు వైభవంగా ఆచరించారు.

హిందూపురంలో

స్థానిక బేసిక్ ట్రెయినింగు పాఠశాలలో జరిగిన నెహ్రూ షష్టిపూర్త్యుత్సవ సందర్భంలో గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు నెహ్రూ పటమును ఆవిష్కరిస్తూ నెహ్రూ జీవిత విశేషాలనుగూర్చి, ఆయన ఆదర్శములు, తదాచరణ విధానాన్ని గూర్చి దీర్ఘోపన్యాసం గావించారు.

# నెహ్రూకు పరిషత్ కాంగ్రెస్‌పార్టీ విందు

న్యూఢిల్లీ, నవంబర్ 19: భారత రాజ్యాంగ పరిషత్తునందలి కాంగ్రెస్ పక్షమువారు నేడు ప్రధానియు, పార్టీ నాయకుడును అగు పండిత నెహ్రూగారికి విందుచేసిరి. పరిషత్ అధ్యక్షులగు డా॥ రాజేంద్రప్రసాద్, ఉపప్రధాని సర్దార్ పటేల్, ఇతరమంత్రులు, సభయందలి వివిధ పక్షముల సభ్యులు [illegible] పాల్గొనిరి.